# ఆది - అనాది

## ఈశ-కేన-ఐతరేయ-మాండూక్య సూక్తులకు

### అనువాదం, భాష్యం, మూలం

రచన :

డా॥ ఇలపావులూరి పాండురంగరావు




ప్రచురణ :

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1998

బ్రహ్మ సూత్రాలను గురించి ఎందరికో తెలియదు. వీటికి మధ్యే మార్గంలో ఉన్న ఉపనిషత్తులను చాల మంది పట్టించుకోరు. కాని వీటిని గురించి ఏ మాత్రం తెలిసినా అటు బ్రహ్మ సూత్రాలలోని బ్రహ్మవిద్య, ఇటు భగవద్గీతలలోని యోగవిద్య సులభంగా అవగాహనమయ్యే అవకాశ ముంది. సూక్ష్మంలో మోక్షం సాధించాలని సందులో సందు చేసుకొని ప్రయత్నించే ఈ నాటి సాధకులకు ఉపనిషత్తులు ఉపకరించినట్టుగా మరో వాఙ్మయం ఉపకరించదు. అందువల్లనే అందరికీ అవసరమైనవి, అందుబాటులో ఉన్నవి అయిన ఈ ఉపనిషత్తులను తెలుగువారికి పరిచయం చేసేందుకు ఈ చిన్న ప్రయత్నం. దీనివల్ల ఏ కొద్ది మందికయినా ఆత్మానుభూతి కలిగితే ఈ ప్రయత్నం సార్థక మవుతుంది. ఇలాంటి రచనను ఎంతో మక్కువతో, ఆసక్తితో ప్రచురించేందుకు పూనుకొన్న శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారికి శ్రీ వేదమాత చేదోడుగా ఉండి సర్వ మంగళములు చేకూర్చగలదు.

ఇలపావులూరి పాండురంగరావు

ధర్మప్రచారానికీ, ఆస్తికభావ పరివ్యాప్తికీ ఈ గ్రంథము ఎంతైనా ఉపకరించగలదని మా విశ్వాసం. తిరుమల తిరుపతి దేవస్థానం స్వీయప్రచురణగా స్వీకరించి ప్రకటిస్తున్న "ఆది-అనాది" ఆస్తికులకు ఆమోదయోగ్యం కాగలదని ఆశిస్తున్నాము.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# ఆది - అనాది

అది లేనిది అనాది. అదే అన్నింటికి ఆది. దానికి ఆది కాగలిగినది మరొకటి లేదు. కాబట్టి దానికి అంతము కూడా లేదు. ఆద్యంతములు లేని యీ అనాదితత్త్వం తరుగదు, పెరుగదు, నశించదు, వికసించదు. పెరిగిన వరకు పెరిగి, వికసించినవరకు వికసించి, పరిపూర్ణమైన తన ప్రాభవంతో ప్రపంచానికి కూడా పరిపూర్ణతను ప్రసాదించే యీ పరమతత్త్వాన్నే పర బ్రహ్మ స్వరూపంగా భావించి పరమార్థకోవిదులు పరిపరి విధాలుగా ఆ పరమ సత్యాన్ని విశదీకరించారు. ఈ విశదీకరణలో వెలువడిన వాక్ప్రసూనాలే వేద మంత్రాలు. ఎందరో మహానుభావులు విశ్వసౌందర్యంలోని పరమ రహస్యాలను దహరాకాశంలో అవగాహన చేసుకొని లోక కల్యాణార్థమై తమ అనుభూతిని వాగ్విభూతిగా రూపొందించగా విలసిల్లిన అక్షర భారతిని ఈనాడు మనం వేదనాదంలో విని ఆనందిస్తున్నాం.

వేదంలో ప్రధానమయింది నాదం. ఈ నాదం విని ఆనందించవల సిందే కాని, విశ్లేషించి విమర్శించవలసింది కాదు. అందువల్లనే దానికి 'శ్రుతి' అనే పేరు వచ్చింది. శ్రవణ మాత్రంచేత లోపలి ఆత్మానుభూతి బయటికి ఆవిర్భవించి ఆపాతరమణీయంగా ఆనందాన్ని అందిస్తుంది. కొన్ని వేదమంత్రాలలో అర్థగౌరవం అంతగా కనిపించదు. కాని, ఆ మంత్రం ఉచ్చరిస్తున్నప్పుడు లేక వింటున్నప్పుడు గలిగే గగుర్పాటు అనుభవైక వేద్యం. మానవమాత్రుడు మామూలు పరిస్థితిలో పలికిన మాటలుగా అవి కనిపించవు. మనిషిలోని మనీషి తనలో దాగియున్న అక్షరదీప్తిని దర్శించి సమున్నతమైన సమాధిస్థితిలో తనకు తెలియని మనోదశలో ఉన్నప్పుడు అతని వర్చస్సునుండి వెలువడిన వచస్సే వేదనాదం. ఇలాంటి నాదాలు అనాదికాలం నుంచి అనంతంగా వెలువడటం వల్ల "అనంతా వై వేదాః" అని వేదవిదు లన్నారు. అంతులేని వేదసారస్వతాన్ని సాంతంగా, సంగ్రహంగా, సమర్థంగా

సంతరించగల తపస్సంపన్నులు కాలక్రమంలో అవతరించారు. వీరు చేసిన కృషికి ఫలితంగా వేదాంతం రూపొందింది. మామూలుగా వేదాంతమనే పదాన్ని తత్త్వ చింతనకు పర్యాయపదంగా వాడుతుంటాం. కాని వేదాంత మనేది వేదవాఙ్మయంలో ఒక ప్రత్యేకమైన శాఖ. ఉపనిషద్వాఙ్మయమంతా వేదాంతానికి సంబంధించిందే.

వేదాలు నాలుగు -- ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం. బాహ్యసృష్టిలోని అందచందాలను అంతర్దృష్టితో అవగాహన చేసికొని వాటి ఆంతర్యాన్ని అనురాగంతో కీర్తించిన ఆనందగీతికలు ఋగ్వేదంలోని ఋక్కులయితే, గృహమేధికి కావలసిన గృహ్యసూత్రాలు, యజ్ఞయాగాదులు, కర్మకాండకు సంబంధించిన మంత్రాలు యజుర్వేదంలో చేరాయి. పాడు కొని కొనియాడదగిన పరమరమణీయ పదసంపద సామగాన మయితే, ఐహికాముష్మిక రహస్యసంపుటి అథర్వణరూపాన్ని ధరించింది. ఇలా నాలుగు భాగాల్లో విస్తరిల్లిన వేదవాఙ్మయంలో తిరిగి నాలుగు శాఖలు ఏర్పడ్డాయి -- మంత్రభాగం, బ్రాహ్మణ భాగం, ఆరణ్యకం, ఉపనిషద్భాగం. మంత్రభాగాన్ని సంహితా భాగమని కూడా అంటారు. ఇందులో మంత్రాలన్నీ సంగ్రహంగా కూడి ఉంటాయి. ఈ మంత్రాలకు వినియోగం, ప్రయోజనం, ప్రక్రియ నిరూపించేది బ్రాహ్మణ భాగం. బ్రహ్మశబ్దానికి మంత్రమనే అర్థం ఉంది. బ్రహ్మతత్త్వాన్ని అంటే మంత్ర తంత్రాన్ని నిర్వచించి వ్యాఖ్యానించేది బ్రాహ్మణం. ఈ భాగంలో ఎక్కువగా ప్రవృత్తి మార్గానికి చెందిన విషయా లుంటాయి. నివృత్తి మార్గానికి చెందిన వైరాగ్యసూత్రాలు, వేద రహస్యాలు ఆరణ్యకంలో ఉంటాయి. ఈ రెంటి సమన్వయం చివరి భాగమయిన ఉపనిషత్తులలో కనిపిస్తుంది. ఇది వేదవాఙ్మయానికి తుది భాగ మవటంవల్ల దీనికి వేదాంతమని పేరు వచ్చింది. ఒక విధంగా ఇది వేదసారమని భావించవచ్చు. సమస్త వేద సారస్వతానికి నవనీతం లాంటి యీ వాఙ్మయాన్ని 'ఉపనిషత్తు' అనే పేరుతో ఎందుకు వ్యవహరించారో కొంచెం జాగ్రత్తగా పరిశీలించి బోధపరచుకోవాలి.

'ఉపనిషత్తు' లేక 'ఉపనిషద్' అనే మాట 'సద్' అనే ధాతువు నుండి వచ్చింది. ఆ ధాతువుకు 'ఉప', 'ని' -- అనే రెండు ఉపసర్గలు చేరాయి. 'సద్' అనే ధాతువుకు 'కూర్చుండుట' అని అర్థం. 'ఉప' - సామీప్యాన్ని సూచిస్తుంది. 'ని'-నిష్ఠను తెలియపరుస్తుంది. దీనిని బట్టి ఆచార్యుల పదసమీపంలో నిష్ఠతో కూర్చొని నేర్చుకొన్న వివేకవిజ్ఞానాలు ఉపనిషద్విషయాలు కావాలి. ఉపనిషద్ -- అనే శబ్దానికి ఇదే వాచ్యార్థం. కాని, శ్రుతిపరంపర ననుసరించి బ్రహ్మవేత్తలు దీనికి మరో గూఢార్థం చెప్తారు. 'సద్' అనే ధాతువుకు నశింపచేయటం అనే అర్థం కూడా ఉంది. ఈ అర్థాన్ని పురస్కరించుకొని, ప్రస్థానత్రయానికి భాష్యం వ్రాసిన శ్రీ శంకర భగవత్పాదులు ఉపనిషత్పదాన్ని నిర్వచిస్తూ ఇలా అంటారు. "యథా, య ఇమాం బ్రహ్మ విద్యాం ఉపయంతి--ఆత్మభావేన శ్రద్ధాభక్తి పురస్సరాః సంతః, తేషాం గర్భజన్మ జరా రోగాది-అనర్థపూగం నిశాతయతి, పరం వా బ్రహ్మ గమయతి, అవిద్యాది సంసారకారణం చ-అత్యంతం-అవసాదయతి-వినాశయతి-ఇతి-ఉపనిషత్." (ఉపనిషత్తులలో ఇమిడియున్న ఈ బ్రహ్మ విద్యను సమీపించగానే శ్రద్ధాభక్తి సంపన్నులైన ఆత్మ వంతులకు తల్లి గర్భములో మగ్గుట, పుట్టుట, ముసలితనములో క్షీణించుట, నానావిధములయిన వ్యాధులతో బాధపడుట మొదలైన అనర్థములు తొలగి, మరల మరల పుట్టుటకు మూలకారణమైన అవిద్య నశించి, పరబ్రహ్మ సాక్షాత్కారం లభిస్తుంది. కాబట్టి వీటికి ఉపనిషత్తులని పేరు.) దాదాపు ఇదే నిర్వచన పద్ధతిని మిగిలిన ఆచార్య వర్యులుకూడా అనుసరించారు. ఏ పద్ధతిలో చూచినా ఉపనిషత్తులు వాచ్యార్థంలో గూఢార్థంలో ఒకే పరమార్థాన్ని ప్రతిపాదించే పరమరహస్య పేటికలు.

అసలు ఉపనిషత్-శబ్దాన్ని వాక్యవిశారదుడైన వాల్మీకి రహస్యమనే అర్థంలో ప్రయోగించిన విషయం గమనింపదగినది. విశ్వామిత్రుడు రామ లక్ష్మణులకు సాంగోపాంగంగా సరహస్యంగా ఉపనిషదుపకరణాలను ప్రసా దించాడట! (సాంగోపాంగోపనిషదః సరహస్యం ప్రదీయతామ్.) ఉప నిషత్తు లన్నింటిలో బృహదాకారం వహించిన బృహదారణ్యకోపనిషత్తులో ఉపనిషత్తు సత్యానికి సత్యమని చెప్పబడింది. కేనోపనిషత్తులో కూడా బాహ్య

భ్యంతరజగత్తులో ఇమిడియున్న బ్రహ్మతత్త్వమంతా ఉపనిషన్మయమని శాంతిపాఠంలోనే సూచించటం జరిగింది. ఛాందోగ్యంలో ఉపనిషత్పదాన్ని ధ్యానశబ్దానికి పర్యాయంగా, శ్రద్ధకు అనుపూరకంగా వాడటం గమనించదగ్గ విషయం. (యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి.) ఇలా రాను రాను ఉపనిషద్వాఙ్మయంతో పాటు శబ్దార్థం కూడా విస్తరిస్తూ వచ్చింది.

ఉపనిషత్తుల సంఖ్య సరిగా లెక్కపెట్టి చెప్పటం సాధ్యం కాదు. ముక్తికోపనిషత్తులో 108 ఉపనిషత్తులను గురించి చెప్పబడింది. ఇవి కాక, షడ్దర్శనాలకు, ఆగమాలకు, తంత్రశాస్త్రానికి సంబంధించిన ఉపనిషత్తు లనేకము లున్నాయి. అన్నింటిలో ప్రధానమైనవి పది.

"ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః,
ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం తథా."

ఈ పది ఉపనిషత్తులకు శంకరభగవత్పాదులు భాష్యం వ్రాయటం వల్ల వీటి ప్రాశస్త్యానికి ప్రామాణ్యం ఏర్పడింది. ఇటీవల డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు కూడా ముఖ్యమైన ఉపనిషత్తులకు ఆంగ్లభాషలో చక్కని భాష్యం వ్రాశారు. కాని శంకరుల సంస్కృత భాష్యం కాని, రాధాకృష్ణ పండితుల ఆంగ్లభాష్యం కాని సామాన్య భారతీయులకు అందు బాటులో లేవు. సంస్కృతం పండితుల భాష. ఆంగ్లం అధికారుల భాష. జన సామాన్యం ఈ రెండు వర్గాలకు చెందినవారు కాకపోవటంవల్ల వారికి ఈ విజ్ఞానం ఆకాశకుసుమమైపోయింది. దానికి తోడు ఉపనిషత్తులలో, వేదాంత శాస్త్రంలో వాడే భాష చాల క్లిష్టమైనదనే ఒక అపోహ జన సామాన్యంలో ఉంది. మంత్రద్రష్టలైన మహర్షులు మమకారం మూర్తీభవించిన మహనీయులు. మానవుడన్నా, మానవత్వం అన్నా, మానవ జీవితం అన్నా వాళ్ళకు సహజమైన అనురాగం, వాత్సల్యం, కారుణ్యం. అందరికీ అందు బాటులో ఉండాలనే ఆశయంతో వాళ్ళు తమ వాక్కును ఆపాతమధురంగా, సులభసాధ్యంగా, సర్వజన బోధగమ్యంగా ప్రతిపాదించారు. బ్రహ్మసూత్రాది సూత్ర గ్రంథాల మాట వేరు. అనేక విషయాలను ఏక సూత్రంగా కొద్ది

మాటల్లో చెప్పాలనే ప్రయత్నం వల్ల ఈ సూత్ర గ్రంథాలు అంత క్లిష్ట శైలిలో రూపొందాయి. కాని, ఉపనిషత్తులలో వాడిన భాష మాత్రం ఏ మాత్రం సంస్కృత పరిచయం కలిగిన బాలునికి కూడా అవలీలగా బోధపడుతుంది. అందువల్లనే భాష్య గ్రంథాలకంటె అసలు గ్రంథాలే సులభంగా ఉంటాయి. కాని, సంస్కృత భాషాజ్ఞానమే అరుదయిన ఈ రోజుల్లో సరళశైలిలో ఉన్న ఉపనిషత్తులు కూడా మనకు ఉపయోగపడకుండా ఉన్నాయి. కాబట్టి వీటిలోని పరమార్థాన్ని పామరజనులకు కూడా అందుబాటులో ఉండేటట్టు చేయడం ప్రతి విద్యావంతుని కర్తవ్యం.

అల్పారంభం క్షేమకరమనే ఉద్దేశంతో నాలుగు ఉపనిషత్తులను మాత్రమే తీసికొని వాటిని సరళమైన తెలుగులో అనువదించి ఒక్కొక్క ఉపని-షత్తుకు ప్రత్యేకమైన చిన్న పీఠిక చేర్చి "అది-అనాది" అనే పేరిట ఈ పుస్తకం జిజ్ఞాసువులకు అందజేయుటం జరుగుతున్నది. ఇందులోని నాలుగు ఉపనిషత్తులు నాలుగు వేదాలకు సంబంధించినవి. మొదటిది ఈశావాస్యోపనిషత్తు యజుర్వేదానికి సంబంధించినది. 'అది-ఇది' అనే పేరుతో దీని తెలుగు రూపొందింది. రెండవది కేనోపనిషత్తు సామ వేదానికి చెందినది. 'ఏది' అనే పేరిట ఇది తెలుగులో కూర్చబడింది. ఇలాగే ఋగ్వేదానికి చెందిన 'ఐతరేయోపనిషత్తు' సృష్ట్యాదిని వివరిస్తుంది. కాబట్టి దానికి 'ఆది' అని పేరు పెట్టటం జరిగింది. చివరిది మాండుక్యం అథర్వణ వేదంలోది. అనాదినాదమైన ప్రణవ తత్త్వాన్ని ప్రాణతత్త్వంతో సమీకరించి సమీక్షించే సారగర్భితమైన ఈ ఉపనిషత్తు 'అనాది' అనే పేరిట ఈ సంకలనంలో చోటు చేసుకొంది. ఇలా నాలుగు వేదాల నుండి నాలుగు ఉపనిషత్తులను తీసుకొని తెలుగు చెవికి ఆ శ్రుతి మాధుర్యాన్ని వినిపించేందుకు కూర్చిన చతుశ్శ్రుతి -- ఈ "అది-అనాది". ఇది రెంటికీ సంధాయకంగా ఉపకరించగలదని ఆశ.

భగవద్గీతలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు భారతీయ తత్త్వచింతనకు మూలకందములు. వీటినే ప్రస్థానత్రయం -- అని అంటారు. భగవద్గీతలను గురించి అందరికి కాకపోయినా, చాలమందికి కొంత తెలుసు.

# ముందుమాట

ప్రపంచంలో భారతీయులు వేదాంత విజ్ఞానంలో సాటిలేని వారనడం సత్యమైన మాట. ఆర్షవిజ్ఞానం అపార గంభీరసాగరం వంటిది. అందులో అనర్ఘ రత్నాలూ, అమూల్యాలైన ఆణి ముత్యాలూ ఎన్నో ఉద్భవించి మానవుడి అజ్ఞానాంధకారం రూపుమాపుతూ దీపిస్తున్నాయి. వాటిలో అత్యంత ప్రముఖాలు ప్రశస్తాలు భగవద్గీతలూ, ఉపనిషత్తులూ, బ్రహ్మ సూత్రాలూ.

వీటిలో ఉపనిషత్తులు మధ్యమణిన్యాయంతో ఎసలారుతున్నాయి. ఉపనిషత్తులు ఇన్ని అని ఖచ్చితంగా చెప్పడం అసాధ్యం. అయినప్పటికీ అవి నూటెనిమిదిగా ప్రసిద్ధాలు. వీటిలో ఈశ కేనాది దశోపనిషత్తులు చాలా ముఖ్యములని విజ్ఞుల అభిప్రాయం.

ఈ పది ఉపనిషత్తులకూ శ్రీశంకరభగవత్పాదులవారు భాష్యం రచించడంవల్లనే వీటి ప్రాముఖ్యం అవగతమవుతున్నది. ఇవి కైవల్య సౌధాధిరోహణకు నిచ్చెనల వంటివి. మీదు మిక్కిలి గీతల, బ్రహ్మసూత్రాల విజ్ఞాన పూర్ణతకు ఇవి పరమోపకారకములని చెప్పడం అత్యుక్తికాదు. బ్రహ్మసాయుజ్యం పొందించేవి గనుకనే వీటికి ఉపనిషత్తులనే పేరు సార్థకమవుతున్నది.

ఈశావాస్యోపనిషత్తు, కేనోపనిషత్తు, ఐతరేయోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు - ఈ నాలుగూ "ఆది-అనాది" అనే ఈ చిన్ని పుస్తకములో వస్తువులుగా స్వీకరించబడ్డాయి: ఆ ఉపనిషత్తుల సారాంశం, మూలం, ప్రాయికంగా గేయచ్ఛందములో సాగిన సరళానువాదం ఒక్కటిగా ఇందులో పొందుపరచబడింది. భాష, భావాలూకూడా కొత్త పద్ధతిలో ఉన్నాయి. ఉపనిషత్ సముద్రం మథించి వేదాంత సుధను ఆంధ్ర జనతకు 'ఆది-అనాది' ద్వారా ఆస్వాద్యంగా సమర్పించిన శ్రీ ఇలపావులూరి పాండురంగరావు గారిని అభినందిస్తున్నాము.

# సారాంశం

మన కంటికి కనిపించేది, మన తనువును కని పెంచేది, మన మనసును మురిపించేది, మన మనుగడ వెలయించేది శుద్ధపార్థివమైన యీ భౌతిక ప్రపంచం. ఈ పార్థివమైన ప్రపంచంలోనే అపార్థివమైన పరమార్థం ఉంది. ఈ రెండూ ఒకే అఖండ చైతన్యంలోని అవిచ్ఛిన్నమైన అంశాలు. దేని కదే పరిపూర్ణం. ఒక దానికొకటి పరిపూరకం. పరిపూర్ణమైన బ్రహ్మతత్త్వం నుంచే పరిపూరకమైన జీవతత్త్వం ఉదయించింది. జీవతత్త్వంనుంచి శరీరం విడిపోయిన తరువాత శేషించి ఉండే చిరంతన చైతన్యంకూడా పరిపూర్ణమైన బ్రహ్మతత్త్వమే. ఈ శాశ్వత సత్యాన్ని విప్పిచెప్పే ఈ ఈశావాస్యోపనిషత్తు ఉపనిషద్వాఙ్మయంలో అనుపమానమైన సూక్తిసుధాలహరి.

మిగిలిన ఉపనిషత్తులవలె కాక ఇది మంత్ర భాగంలో చేరినది కావటం ఇందులోని విశేషం. శుక్ల యజుర్వేదంలోని నలభయ్యో అధ్యాయానికి చెందిన యీ ఉపనిషత్తులో మొత్తం 18 మంత్రాలు లేదా శ్లోకాలు ఉన్నాయి. భారతంలో పర్వాలు 18, గీతలో అధ్యాయాలు 18, పురాణాలు 18, కావ్యాలలో వర్ణించదగిన విషయాలు 18. సామాన్యంగా 18 జయ సంఖ్యగా భావించబడుతుంది. ఈ జయసంఖ్య ఈశావాస్యోపనిషత్తులోని మంత్ర సంఖ్య కావటం విశేషం. సంఖ్యలోనే గాక సాంఖ్యంలో కూడా ఈ ఉపనిషత్తు సకల వేదాంతసారమని చెప్పవచ్చు. ఇందు గీతాధ్యాయికి గీతార్థసారం కనిపిస్తుంది. అద్వైతికి అద్వైతం కనిపిస్తుంది. కర్మయోగికి అనాసక్తియోగం కనిపిస్తుంది. సన్న్యాసికి కర్మఫలసన్న్యాసం కనిపిస్తుంది. భక్తునకు అనన్యపర్యుపాసన కనిపిస్తుంది. ఇలా ఏ దృష్టితో చూస్తే ఆ దృక్కుకు సంబంధించిన జ్ఞానం విస్తృతంగా గోచరిస్తుంది. ఇంతటి ధ్వనిప్రధానమైన ఉపనిషత్తు మరొకటి కనిపించదు. అందుకనే దీనిని సర్వోపనిషత్సారమని అంటారు. భగవద్గీతలో ఎలా ఉపనిషత్తులన్నీ ప్రతి ధ్వనించినట్టు వినిపిస్తాయో, ఈ ఉపనిషత్తులోని 18 మంత్రాలలో కూడా సమస్త వేదాంతం ప్రతిబింబించినట్టు కనిపిస్తుంది.

మొట్టమొదటి మంత్రంలోనే ప్రపంచం పరమేశ్వరుని లీలావిలాసం తప్ప మరేమీకాదనే పరమసత్యం సరళమైన భాషలో చెప్పబడింది. మన కంటికి కనిపించే యీ ప్రపంచమంతా ఈశావాస్యం - పరమేశ్వరుడు నిరంతరం నివసించునది, నివసించదగినది. ఇందులో మనది అనుకొన దగినది అణుమాత్రం కూడా లేదు. 'సర్వ ము న్నతని దివ్యకళామయ' మని భావించినపుడు స్వభావనకుగాని, స్వార్థబుద్ధికి కాని తావే లేదు. అందుకనే త్యాగబుద్ధితో, సర్వేశ్వర భావనతో ఆనందమయు డందించిన ఆనందాన్ని అనాసక్తితో అనుభవించవలసిందని ఈ ఆర్షవాక్యం ఆదేశిస్తుంది. 'నా' 'నా' అనే భావన వదిలితే కాని నాదికానిది బోధపడదు.

అలా అని సర్వస్వం త్యజించమనికాదు. త్యాగ బుద్ధితో అనుభవించటం కర్తవ్యం. చేయవలసిన పనులను చేస్తూ నూరు సంవత్సరాలు జీవించాలని కోరుకోవాలని ఈ ఉపనిషత్తు బోధిస్తుంది. అలా నిర్లిప్తంగా, నిష్కామంగా చేసినకర్మ ఆత్మోన్నతిని చేకూరుస్తుందట. కర్మజగత్తులో మరోమార్గం లేదట. భగవద్గీతలో చెప్పిన నిష్కామ కర్మయోగం ఈ ఒక్క మంత్రంలో ఇమిడిపోయింది. 'చేసి తీరాలి' అని దీనికి సారాంశం.

ఆ చేసే పని 'తెలిసి చెయ్యాలి' అని తర్వాతి మంత్రం చెబుతుంది. 'తాను కేవలం రక్తమాంసాలతో కూడిన మట్టిబొమ్మకాదు. తనలో ఆత్మవైభవం అనంతంగా ఉంది' - అనే విషయం తెలిసి, ఆత్మోన్నతికి, ఆత్మసాక్షాత్కారానికి అనువుగా ఆచరించుకొనటం ఆత్మవంతుని లక్షణం. అలా చెయ్యనివాడు ఆత్మఘాతుకుడు, పశుతుల్యుడు. ఒకవిధంగా చూస్తే పశువుకంటె హీనుడు. పశువు ఇతర జీవులను హింసిస్తుంది. కాని ఆత్మజ్ఞానం లేని అంధమతి తన ఆత్మనే చంపుకుంటున్నాడు. ఇలాంటి ఆత్మఘాతుకులు కారుచీకట్లు క్రమ్మిన భీకర లోకాలకు పోతారట! ఈ హెచ్చరికతో ఈ ఉపనిషత్తులోని కర్మధర్మ సమన్వయం ముగిసిపోతుంది.

తరువాతి నాలుగు మంత్రాల్లో ఆత్మతత్త్వాన్ని, ఆత్మజ్ఞాని లక్షణాలను వివరించటం జరుగుతుంది. ఆత్మ చలించదు. కాని దానితో సమానంగా దేవతలు కూడా పరుగిడలేరు. ఎంత వేగంతో ముందుకు వెళ్ళినా ఆత్మ

తత్త్వం వెనుకనుంచి క్షణంలో మనలను పట్టుకోగలదు. అసలు గాలి, నీరు అన్నీ అందులోనే ఉంటాయి. పంచతత్త్వాలకు ఆత్మ తత్త్వమే ఆశ్రయం ఇస్తుంది. చలించినట్టే కనిపించినా నిజానికి ఆత్మ నిశ్చలం. ఎంత దూరంలో ఉన్నా పరమ సామీప్యంలో భాసిస్తుంది. దాని ఉనికిని కొలిచి చెప్పటం సాధ్యంకాదు. లో వెలుపల ఎక్కడ ఉన్నదని కూడా చెప్పలేము. లోపల ఉన్న ఆత్మతత్త్వమే బయట భాసిస్తుంది. అన్నివైపులా అన్నింటిలో నిండియున్న ఆ ఆత్మతత్త్వాన్ని గుర్తించి తనలో అన్నింటిని, అన్నింటిలో తనను చూచుకోగలిగిన చూపరికి చీకూ, చింతా ఉండదు. అతన్ని సాంసారిక బాధలు బాధించవు. అన్నింటిలో అభేదాన్ని చూడగలగటంవల్ల అఖండమైన ఆనందం లభిస్తుంది. ఈ అభేదం తనకూ, తన తోటి చరాచర సృష్టికీ పరిమితంకాక క్రమంగా జీవాత్మ పరమాత్మలవరకు వ్యాపిస్తుంది. ఆత్మకు, అనాత్మకు, విద్యకు, అవిద్యకు, వికాసానికి, వినాశానికి భేదమే లోపిస్తుంది.

ఈ నిరపేక్ష దృష్టి మూధు మూడు మంత్రాల జంటల్లో ప్రతిబింబి స్తుంది. ఈ ఆరు మంత్రాలు (9-14) బీజగణిత సమీకరణాల్లా వినిపిస్తాయి. వీటికి ముందున్న మంత్రం (8) ఈ సమీకరణంలోని అప్రమేయ చైత న్యాన్ని బీజాక్షరాల్లో నిరూపిస్తుంది. అవయవములతో ప్రమేయం లేకుండా, తరుగు పెరుగులకు గురికాకుండా, నిర్మలంగా, నిశ్చలంగా తనంతట తాను ప్రభవించి, అన్నింటిని మించి అనంతకాలంవరకు అప్రతిహతంగా వెలిగే మనీషి ఈ మంత్రంలో కనిపిస్తాడు.

అతని దృష్టికి విద్య, అవిద్య సమానమే. అవిద్య ఎంత హానికరమో విద్యకూడా అంతటి హానికి హేతువవుతుందని అతడు భావిస్తాడు. రెంటి రహస్యం బాగా తెలిసినవాడు కాబట్టి, ఆ మనీషి అవిద్యను ఆధారం చేసి కొని మృత్యువును దాటుతాడు. ఆ తర్వాత విద్యను చేయూతగా తీసికొని అమృతత్వం పొందుతాడు. ఇక్కడ విద్యకానిది, తెలివికి భిన్నమయినదంతా అవిద్య కింద వస్తుంది. ప్రజ్ఞానం, విజ్ఞానం, సంజ్ఞానం, అభిజ్ఞానం మొద- లయిన వర్గాలకు చెందిన జ్ఞానమంతా విద్య, జ్ఞానంతో పనిలేని కర్మలన్నీ అవిద్యకింధ వస్తాయి. తెలివితేటలు విద్య కాగా, పనిపాటలు అవిద్యగా

రూపొందుతాయి. కాని ఈ రెంటికి సామంజస్యం కావాలని ఈ మంత్ర సంపుటి కాంక్షిస్తుంది. కామ్య కర్మలను ఆచరించటంవల్ల మృత్యువును దాటి అమృతలోకంలో అడుగుపెట్టటం సాధ్య మవుతుంది. ఆ తర్వాత జ్ఞానం అమృతాన్ని అందిస్తుంది. జ్ఞానకర్మలకు సమన్వయం కుదిరితే కాని మర్త్యుడు అమరుడు కాలేడు. 'తెలిసి చెయ్యాలి' అనే నినాదం మళ్ళీ ఇక్కడ వినవస్తుంది.

ఇలాంటి సమన్వయాన్నే సంభూతి - అసంభూతి అనే జంటను తీసుకొని తరువాతి మూడు మంత్రాలు వివరిస్తాయి. సంభూతి బ్రహ్మతత్త్వాన్ని సూచిస్తుంది. అసంభూతి జీవలక్షణాలను చెపుతుంది. జీవుడు లేనిదే బ్రహ్మ పదార్థం గోచరించదు. బ్రహ్మను వీడి జీవుడు జీవించలేడు. నశించే నరతత్త్వాన్ని ఆశ్రయించి నరకబాధలను దాటాలి. ఆ తర్వాత నరుడు అవినశ్వరమైన పరతత్త్వాన్ని అందుకొని అమరత్వం సాధించగలుగుతాడు. జీవబ్రహ్మ సమన్వయం, కర్మజ్ఞాన సమన్వయం సమగ్రంగా బోధపరచుకొన్న జ్ఞానికి ఆ పరమసత్యాన్ని కళ్ళార చూచి ఆనందించాలని ఆకాంక్ష కలుగుతుంది.

ఈ లాలస తరువాతి మంత్రం(15)లో గోచరిస్తుంది. బంగారుపాత్రలో సత్యస్వరూపం దాగిఉంది. ఈ పసిడి పొర తొలగితేగాని లోపలి సత్యం బయట పడదు. కాబట్టి ఈ పొర తొలగించవలసిందని మరిమరి తన దొరను వేడుకుంటాడు-చూపులకు వలగొన్న సాధకుడు. 'చేసి చూడాలి' అనే మూడోమెట్టు ఇక్కడ కనిపిస్తుంది.

ప్రపంచాన్ని పోషిస్తూ, ప్రపంచమంతటా ప్రకాశిస్తూ, ప్రతి అణువునూ తన చెప్పుచేతల్లో అణగి మణగి ఉండేటట్టు శాసించే కాంతిపుంజాన్ని చూడాలని సాధకుడు ఆందోళన చెందుతాడు, ఆరాటపడతాడు. కాని, ఏవేవో కిరణాలు అసలు కాంతికి అడ్డం తగులుతాయి. వాటినన్నిటినీ ఉపసంహరించి స్వచ్ఛమైన స్వప్రకాశాన్ని, కమనీయమైన కల్యాణ రూపాన్ని కనబరచవలసినదని గట్టిగా పట్టుపడతాడు. ఆ కాంతిపుంజం కనిపించేసరికి అసలు రహస్యం బయటపడుతుంది. తనకూ, ఆ తనువుకూ భేదమే లేదని అప్పుడు తెలిసిపోతుంది.

మట్టికుండలాంటి మానవశరీరంలో సంచరించే సూక్ష్మ సమీరం మట్టితో పాటు మట్టిలో కలిసిపొయ్యేది కాదు. మృణ్మయ తత్త్వానికి హిరణ్మయ లావణ్యం ప్రసాదించే ఈ ప్రాణవాయువు పార్థివశరీరం నశించిన తరువాత అపార్థివమైన ఆకాశశరీరంలో లీనమైపోతుంది. కాబట్టి శాశ్వతమైన ఆకాశ శరీరాన్ని మరువక క్షణభంగురమైన శరీరం ఉన్నంతవరకు చేయవలసిన పనులను క్రతుదీక్షతో చెయ్యాలి. అప్పుడే మర్త్యు డమరు డవుతాడు.

ఇలాంటి అప్రమత్తత, సద్బుద్ధి, కార్యదీక్ష ప్రసాదించి సన్మార్గంలో తనను తీసికొనిపొమ్మని చివరి మంత్రంలో సాధకుడు సర్వసాక్షిగా ఉన్న అగ్నిని ప్రార్థిస్తాడు. పయనించవలసిన బాటసారి అనాయాసంగా ఆటపాట లతో హాయిగా ముందుకుసాగి, గమ్యాన్ని సకాలానికి సంతోషంగా చేరేందుకు తగిన పాథేయాన్ని ప్రసాదించవలసినదని దారిచూపే అగ్నిని మరి మరి ప్రార్థిస్తాడు. మరి మరి నమస్కరిస్తాడు. ఈ నమోవాకంతో ఈశావాస్యం సమాప్తమవుతుంది.

ఇందులోని 18 మంత్రాలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఇందులో 'చేసి తీరాలి', 'తెలిసి చెయ్యాలి', 'చేసి చూడాలి', 'చూచి చేయాలి' -- అనే నాలుగు సోపానాలు కనిపిస్తాయి. ఈ నాలుగు మెట్లల్లో క్రమంగా కర్మ, జ్ఞాన, భక్తి, తాదాత్మ్యాలు గోచరిస్తాయి. ఈ కర్మ జ్ఞాన భక్తి సమన్వయమే భగవద్గీతలో కూడా అంచె లంచెలుగా కనిపిస్తుంది. మొదటి మూడు అధ్యాయాలలో కర్మయోగం, తర్వాతి నాలుగు (4-7) అధ్యాయాలలో జ్ఞానయోగం, మధ్య అయిదు (8-12) అధ్యాయాలలో భక్తియోగం, చివరి ఆరు (13-18) అధ్యాయాలలో మోక్షమార్గం నిరూ పింపబడిన విషయం ఈ సందర్భంలో గమనించాలి. ఈ దృష్టితో చూస్తే అన్ని ఉపనిషత్తులకు సారభూతమైన గీతలోని నవనీతం ఈశావాస్యంలో ఇమిడి ఉన్నట్టు తోస్తుంది. అందువల్లనే ఇది ఉపనిష ద్వాఙ్మయానికి మకుటాయమానమైనదని భావించటంలో తప్పులేదు.

* * *

# ఈశావాస్యం
## (మూలం)

ఓం పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే,
పూర్ణస్య పూర్ణ మాదాయ
పూర్ణమేవావశిష్యతే.

*ఓం శాంతిః శాంతిః శాంతిః.*

ఈశావాస్య మిదం సర్వం
యత్కించ జగత్యాం జగత్,
తేన త్యక్తేన భుంజీథా
మా గృధః కస్య స్విద్ధనం. 1

కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషే చ్ఛతం సమాః,
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి
న కర్మ లిప్యతే నరే. 2

అసుర్యా నామ తే లోకా
అంధేన తమసాఽఽవృతాః,
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి
యే కే చాత్మహనో జనాః. 3

# అది - ఇది
# (అనువాదం)

ఆదియు పూర్ణము ఇదియు పూర్ణము
పూర్ణమున ఉదయించు పూర్ణము
పూర్ణమున పూర్ణంబు పోయిన
పూర్ణమే శేషించి యుండును.

* * *

జగతి జగముగ గోచరించెడు
సకల మీశావాస్య మియ్యది
అనుభవించుము త్యాగమతితో
వలదు లోభము-ఎవరిదీ సిరి? 1

ఆచరించుచు కర్మలను జీ
వించవలె శత వత్సరంబులు
లేదు మార్గాంతరము నీ కిక
అంట దిటు లిట కర్మ నరులను. 2

ఆత్మఘాతకు లరుగుదురు దే
హాంతమున లోకాంతరములకు
అవి అసూర్యము లందెపుడు గా
ఢాంధకారము నిండియుండును. 3

అనేజదేకం మనసో జవీయో
నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్,
తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్
తస్మిన్నపో మాతరిశ్వా దధాతి. 4

తదేజతి తన్నైజతి
తద్దూరే తద్వంతికే,
తదంతరస్య సర్వస్య
తదు సర్వస్యాస్య బాహ్యతః. 5

యస్తు సర్వాణి భూతాని
ఆత్మన్యేవానుపశ్యతి,
సర్వ భూతేషు చాత్మానం
తతో న విజుగుప్సతే. 6

యస్మిన్ సర్వాణి భూతా -
న్యాత్మైవాభూ ద్విజానతః,
తత్ర కో మోహః కః శోకః
ఏకత్వ మనుపశ్యతః. 7

స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ
మస్నావిరం శుద్ధ మపాపవిద్ధం,
కవిర్మనీషీ పరిభూః స్వయంభూ
ర్యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్
శాశ్వతీభ్యః సమాభ్యః. 8

కదలదది మదికంటె వడిదది
అందదది ముందరుగు సురలకు
అందుకొను పరుగెత్తువారిని
అందె జల మనిలములు నిలుచును. 4

నడచు నది నడ యుడిగి నిలుచును
దూర మరుగును చేరు చెంతకు
ఉండునది యన్నింటి లోపల
అన్నిటికి బాహ్యముగ తోచును. 5

ఆత్మలో భూతముల నెల్లను
సకల భూతములందు ఆత్మను
గురుతుగా కనుగొన్న సకలము
తెలియనగు, తెలియనిది ఉండదు. 6

సకలభూతము లాత్మయం దుద
యించునని గమనించు వారికి
ఒకటిగనె కనిపించు సకలము
శోకమోహము లతని సోకవు. 7

అతడు శుక్ర మకాయ మవ్రణ
మయిన దానిని, పాపవిద్ధము
కాని దానిని, శుద్ధమయి అ
స్నావిరంబగు దాని పొందును.

కవి యతండు మనీషి పరిభువు
డాత్మభవుడు యథార్థ మరయుచు
కూర్చు నిల సకలార్థములు పలు
వత్సరంబులు శాశ్వతంబుగ. 8

అంధంతమః ప్రవిశంతి
యే (అ) విద్యా ముపాసతే,
తతో భూయ ఇవ (తే) తమో
య ఉ విద్యాయాం రతాః. 9

అన్యదేవాహు ర్విద్యయా -
అన్య దాహు రవిద్యయా,
ఇతి శుశ్రుమ ధీరాణాం
యే న స్త ద్విచచక్షిరే. 10

విద్యాం చావిద్యాం చ
యస్త ద్వేదోభయం సహ,
అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయా (అ)మృత మశ్నుతే. 11

అంధం తమః ప్రవిశంతి
యే (అ)సంభూతి ముపాసతే,
తతో భూయ ఇవ (తే) తమో
య ఉ సంభూత్యాం రతాః. 12

అన్యదేవాహుః సంభవాత్ -
అన్య దాహు రసంభవాత్,
ఇతి శుశ్రుమ ధీరాణాం
యే న స్త ద్విచచక్షిరే. 13

సంభూతిం చ వినాశం చ
య స్త ద్వేదోభయం సహ,
వినాశేన మృత్యుం తీర్త్వా
సంభూత్యా (అ)మృత మశ్నుతే. 14

చేరుదురు గాఢాంధ తిమిరము
ఇల నవిద్యను కొలుచువారలు,
అటులనే తిమిరమున చొత్తురు
విద్య నిల సేవించువారలు. 9

విద్య గుణమగు కొందరకు, మరి
కొందరెంతు రవిద్య గుణమని
వింటి మిటులా తత్త్వమును వివ
రించి ధీరులు మాకు తెలుపగ. 10

విద్య యిట్టి దవిద్య యిది యని
రెంటి కూరుపు నెరుగువారలు
దాటి మృత్యు వవిద్య తోడుగ
విద్యతో సాధింతు రమృతము. 11

చేరుదురు గాఢాంధ తిమిరము
ఇలను లేమిని కొలుచువారలు,
అటులనే తిమిరమున చొత్తురు
కలిమి నిల సేవించువారలు. 12

కలిమి గుణమగు కొందరకు, మరి
కొంద రెంతురు లేమి గుణమని,
వింటి మిటు లా తత్త్వమును వివ
రించి ధీరులు మాకు తెలుపగ. 13

కలిమి యిట్టిది లేమి యిది యని
రెంటి కూరుపు నెరుగువారలు
దాటి మృత్యువు లేమి తోడుగ
కలిమితో సాధింతు రమృతము. 14

హిరణ్మయేన పాత్రేణ
సత్యస్యాపిహితం ముఖం,
తత్ త్వం పూష న్నపావృణు
సత్య ధర్మాయ దృష్టయే. 15

పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజా
పత్య వ్యూహ రశ్మీన్ సమూహ,
తేజో యత్తే రూపం కల్యాణతమం తత్తే పశ్యామి
యోఽసా వసౌ పురుషః సోఽహమస్మి. 16

వాయురనిల మమృత మథేదం
భస్మాంతం శరీరం,
ఓం క్రతో స్మర కృతం స్మర
క్రతో స్మర కృతం స్మర. 17

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్,
యుయోధ్యస్మ జ్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ. 18

ఓం పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావశిష్యతే.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

పసిడి పూసిన పాత్రలో స
త్యస్వరూపము దాగియున్నది
సత్య ధర్మ సమీక్షణము పో
షించు దార! తొలగించు మీ పొర. 15

పూషఋషివర యమ దివాకర
విధిరచిత దీధితుల నాపుము
చూడవలె నీ శివతమచ్ఛవి
పురుష డత డిత డతడె నేనయి. 16

అనిల వాయువు లమరములు భ
స్మాంతమిది పార్థివ శరీరము
ఓ క్రతూ! మరువకుము కృతమును
మరువకుము క్రతు! మరువకుము కృతి. 17

విశ్వవయున విదుండ వగ్నివి
సుపథమున గొనిపొమ్ము మము ప్రభు!
పొందవలె రాష్ట్రమును, బాధలు
తొలగవలె, మ్రొక్కెదము మరి మరి. 18

అదియు పూర్ణము ఇదియు పూర్ణము
పూర్ణమున ఉదయించు పూర్ణము
పూర్ణమున పూర్ణంబు పోయిన
పూర్ణమే శేషించి యుండును.

* * *

# సారాంశం

కేనోపనిషత్తు సామవేదానికి సారం. సామ వేదానికి సంబంధిం
తలవకారమనే బ్రాహ్మణంలోని తొమ్మిదో అధ్యాయం అవటంవల్ల
తలవకారోపనిషత్తనీ, బ్రాహ్మణోపనిషత్తనీ కూడా అంటారు. 'కేన' శబ్ద
ఈ ఉపనిషత్తు ఆరంభించటంవల్ల దీనికి 'కేనోపనిషత్తు' అనే పేరు వచ్చి
'కేన' అంటే 'దేనివలన' అని అర్థం. ఈ ప్రపంచానికి మూలకారణమేమి
'ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపలనుండు' నన్న భాగవత జిజ్ఞా
ఇందలి మీమాంస ఆరంభ మవుతుంది. జీవితం చరితార్థమయ్యేంద
సాధించవలసిన పరతత్త్వమేది అనే నిర్ణయంతో చర్చ ముగుస్తుంది.

మనం పలికే పలుకులు, మన మనస్సులో మెదిలే ఆలోచన
మనకు వినిపించే ధ్వనులు, మనలను కదిలించి నడిపించే ప్రాణశక్తి
ఇవన్నీ మనకు ఎలా లభించాయి? మట్టిముద్దలాంటి మానవ శరీరం
ఇంత మహత్తరమైన చైతన్యం ఎలా ప్రవేశించింది? దీన్ని ప్రసాదించి
ఎవరు? ఎవరి అండదండలలో ఈ ప్రాణం ఇలా ప్రసరిస్తున్నది? అనే ప్ర
పరంపరలతో ఈ ఉపనిషత్తు ఉపక్రమిస్తుంది.

ఈ ప్రశ్నలకు సమాధానం చెపుతూ మహర్షి 'చెవులకు చెవి, మనస్సు
మనస్సు, వాక్కుకు వాక్కు, ప్రాణానికి ప్రాణం, నేత్రానికి నేత్రం అయి
మూలసూత్రం ఒకటి ఉన్న' దని సూత్రప్రాయంగా చెప్తాడు. ఆ ము
సూత్రాన్ని అందుకొని అవగాహనం చేసికొనేందుకు ఈ మన వాక
చాలదట. మన మనస్సు దానిని ఊహించలేదట. మన దృష్టి అంతవర
ప్రసరించటం లేదట. మనంతట మనకు బోధపడదట. ఒకరు విప్పిచెప్పి
ఆ పరమ రహస్యం మనకు అంత సులభంగా తెలియదట. దానికి కారణ
అది మనకు తెలిసిన విషయాలకు, తెలియని తత్త్వానికి అతీతమై ఉం
టమట. వాక్కును వెలయించే ఆ మూలశక్తిని వివరించేందుకు మనవాక్కు
పనికిరాదు. మనస్సుకు ఆలోచించేశక్తిని ప్రసాదించే ఆ మూలశక్తిని గురిం
మన మనస్సు ఆలోచించలేదు. కండ్లకు చూచే సామర్థ్యం చెవుల

వినే శక్తి ప్రసాదించే ఆ పరమ చైతన్యాన్ని మనం చూడలేము, వినలేము. సకల చరాచర సృష్టిలో ఉన్న ప్రాణికోటిని స్పందింపజేస్తూ నశ్వరమైన శరీరంలోనే అవినశ్వరంగా, అవిచ్ఛిన్నంగా, అభిన్నంగా ఉన్న ఈ పరమ చైతన్యమే బ్రహ్మ - అని ఈ ఉపనిషత్తులోని మొదటి ఎనిమిది మంత్రాలు సోదాహరణంగా వివరిస్తాయి.

అయితే, అంతమాత్రంచేత 'బ్రహ్మపదార్థం నాకు తెలిసిపోయిందని ఎగిరి గంతులువెయ్యటం తెలివితక్కువ' అని హెచ్చరిస్తూ దీనిలోని రెండో భాగం ఆరంభమవుతుంది. మనకు తెలిసిన విషయం చాల స్వల్పం. ఆ కొద్దికూడ మనకు సమగ్రంగా తెలుసని చెప్పేందుకు వీలులేదు. దాన్ని పరి పరివిధాల మరల మరల తరచి చూస్తేనేగాని దానిలోని సారం మనకు బోధపడదు. అలా అని, మనకేమి తెలియదని నిరాశ చెందరాదు. తెలిసికొనవలసినది మనలో ఒక భాగంగా ఉన్నది కాబట్టి, అది మనకు పూర్తిగా తెలియనిదికాదు. మనలోనే దాగియున్న ఆ సత్యాన్ని మనం సమగ్రంగా సాక్షాత్కరించుకోలేము. కాబట్టి అది మనకు తెలిసినదని కూడా ధైర్యంగా చెప్పలేక పోతున్నాము. అసలు రహస్యమేమంటే, "నాకు సర్వం తెలుసు" - అని విఱ్ఱవీగే వెఱ్ఱివాడికి అదేమి తెలియనట్టే భావించాలి. తనకు తెలియదనుకొన్న సాత్త్వికునకే తెలుసుకొనే అవకాశం ఉంది. ఆ సూక్ష్మ తత్త్వాన్ని గురించి నిశితంగా ఆలోచించ గలిగిన సామర్థ్యం ఉండి, ఆ సామర్థ్యాన్ని సక్రమంగా వినియోగపెట్టుకుంటూ కూడా ఈ మనస్విత (ఆలోచనా శక్తి) తనది కాదని భావించగలిగిన తపస్వికే ఆతత్త్వం ఆ మూలాగ్రం బోధపడుతుంది.

అమృతాయమానమయిన ఆ సనాతన తత్త్వాన్ని అవగాహన చేసు కొన్నవాడు దానిలో లీనమైపోతాడు. తనదనుకొన్న ఘనతను చేయూతగా చేసుకొని అతడు తన్ను చేరుకొనేందుకు కావలసిన సామర్థ్యాన్ని సేకరించు కుంటాడు. ఆ సామర్థ్యంతో అతనికి వస్తుజ్ఞానం (విద్య) ఏర్పడుతుంది. ఈ విద్య మర్త్యుడయిన మానవునికి అమరత్వం ప్రసాదిస్తుంది.

కాని, ఈ జ్ఞానమంతా ప్రాణమున్నప్పుడే గ్రహించాలి. ప్రాణవంతమైన ఈ శరీరం ఈ సమస్త జ్ఞానానికి ఆధారం. ఆధారం నశించిన తరువాత సాధించగలిగినది ఏమీలేదు. అందువల్ల ప్రాణికోటిలో ప్రసరించి ప్రేరేపిస్తున్న పరమాత్మ స్వరూపాన్ని సాక్షాత్కరించుకొనేందుకు శరీరధారులందరూ సర్వ కాల సర్వావస్థలయందు అప్రమత్తులై ప్రయత్నించాలి - అని అయిదు మంత్రాల్లో ఉపదేశిస్తూ రెండవభాగం ముగుస్తుంది.

ఆ తర్వాత ఈ సత్యాన్ని నిరూపించే ఒక చిన్న కథను మరి రెండుభాగాల్లో వివరించటం జరుగుతుంది. దేవదానవ యుద్ధంలో దేవతలు గెలుస్తారు. ఈ గెలుపు తమ శక్తి సామర్థ్యాలవల్ల సాధించుకున్నామని వాళ్ళు విజయగర్వంతో విఱ్ఱవీగుతారు. సకల విజయ సంధాత అయిన సర్వేశ్వరుడు వాళ్ళకు నిజం తెలియపరచేందుకు ఒక యక్షరూపంలో అక్కడ ప్రత్యక్ష మవుతాడు. ఉన్నట్టుండి ఎక్కడినుండో ఊడిపడ్డట్టు కనిపించిన ఆ యక్షుడెవడో తెలుసుకొనేందుకు దేవతలు ప్రయత్నిస్తారు. మొదట అగ్నిని పంపుతారు. అగ్ని యక్షుని దగ్గరకు వెళ్ళగానే, ఆ యక్షుడు 'నీ వెవర' వని అగ్నిని అడుగుతాడు. తాను అగ్నినని చెప్పగానే 'నీ వేమి చేయగల' వని యక్షుడు మరో ప్రశ్న వేస్తాడు. తాను ప్రపంచంలోని పదార్థాలనన్నిటినీ క్షణంలో దహించగలనని అగ్నిదేవుడు సమాధానం చెపుతాడు. అప్పు డా యక్షుడు ఒక గడ్డిపోచను ముందువేసి 'దీన్ని కాల్చగలవేమో చూడు' అంటాడు. అగ్ని తన బలమంతా ప్రయోగించి ఆ గడ్డిపోచను కాల్చేందుకు ప్రయత్నిస్తాడు. కాని అది కాలదు. మొగం చిన్న పుచ్చుకొని అగ్నిదేవుడు తిరిగివస్తాడు.

ఆ తర్వాత దేవతలు వాయుదేవుణ్ణి పంపుతారు. అతడుకూడా యక్షుడు వేసిన ప్రశ్నలకు సమాధానంగా తాను వాయుదేవుడనని, తాను లేని తావు లేదని, తనకు అన్నింటిని ఎగురవేసే శక్తి కలదని చెపుతాడు. ఒక గడ్డి పోచను అతని ముందువేసి ఆ యక్షుడు 'దానిని ఎగురవేయగలవేమో చూడు' అని వాయువు నడుగుతాడు. అగ్నివలె వాయువు కూడా ప్రయత్నించి విఫలుడై తిరిగి వెళ్ళిపోతాడు.

చివరకు ఇంద్రుడే స్వయంగా వస్తాడు. అతన్ని చూడగానే యక్షుడు మాయమైపోతాడు. ఆ స్థానంలో చక్కని చుక్కలాంటి ఒక సాధ్వి కని-పిస్తుంది. ఆమెను హైమవతియైన ఉమగా భావించి ఇంద్రుడామెను యక్షుని గురించి ప్రశ్నిస్తాడు. ఆ యక్షుడే మీ విజయానికి మూల కారకుడైన బ్రహ్మ -- అని ఆమె వివరించి చెపుతుంది. పరబ్రహ్మను ప్రత్యక్షంగా చూచిన దేవతలు తాము ధన్యులమని పొంగిపోతారు. రెప్ప పాటులో మెరపులా మెరసిన పరబ్రహ్మను తానందరికంటె సమీపంలో చూడగలిగినందుకు దేవేంద్రుడు బ్రహ్మానందం చెందుతాడు.

ఆ కథ అంతటితో ముగిసిపోతుంది. క్షణంలో విద్యుత్కాంతిలా వెలిగి మళ్ళీ పరమవ్యోమంలో విలీనమైపోయిన పరబ్రహ్మను కళ్ళార చూడటం అధి-దైవతమైన అనుభూతి. ఆ స్వరూపాన్ని చిన్మయాకాశంలో సంకల్పరూపంలో నిలుపుకొని కొలిచి తరించటం ఆధ్యాత్మికమైన సాధన. అసలా అనుభూతి వేరు. ఆ సంకల్పం వేరు. జీవనవనాన్ని తపోవనంగా మార్చగలిగిన ఒకానొక రమణీయ మనోవనం ఆ మహావనం. తత్త్వమయంగావిస్తరించి, తత్త్వకుసుమాలతో విరబూసిన ఆ తాత్త్వికవనాన్ని మంత్రద్రష్టయైన మహర్షి 'తద్వన'మని ధ్వన్యాత్మకంగా సూచిస్తాడు. ఆ తద్వనసారస్యం గ్రహించిన తపస్వి సకల చరాచర సృష్టికి ఇష్టుడవుతాడని చెప్పగానే, శిష్యులు మాకు ఉపనిషత్తు(రహస్యం) చెప్పమని అడుగుతారు. 'చెప్పేశా'నని ఋషి అంటాడు. ఎక్కడ ఎప్పుడు ఏమని చెప్పాడో అని శిష్యులు ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటారు. ఈ ఉపనిషత్తు అంతా తిరిగి ఒకసారి చూచుకొని ఆలోచించుకుంటే ఇందులో రహస్యం ఎక్కడ ఉందో తెలుస్తుంది.

అందుకనే శంకరభగవత్పాదులు దీనికి రెండు రకాల భాష్యం వ్రాశారు.

* * *

# కేనోపనిషత్తు
## (మూలం)

ఓం ఆప్యాయంతు మమాంగాని
వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో
బలమింద్రియాణి చ సర్వాణి,
సర్వం బ్రహ్మౌపనిషదం
మాహం బ్రహ్మ నిరాకుర్యాం
మా మా బ్రహ్మ నిరాకరోత్
అనిరాకరణమస్త్వనిరాకరణం మే (అ)స్తు,
తదాత్మని నిరతే య ఉపనిషత్సు
ధర్మాస్తే మయి సంతు, తే మయి సంతు.

*ఓం శాంతిః శాంతిః శాంతిః.*

## 1

ఓం కేనేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః,
కేనేషితాం వాచ మిమాం వదంతి
చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి.

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్
వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః,
చక్షుష శ్చక్షు రతిముచ్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవంతి.

న తత్ర చక్షు ర్గచ్ఛతి, న వాగ్గచ్ఛతి,
నో మనః, న విద్మో, న విజానిమో

# ఏది
## (అనువాదం)

ఆప్యాయంబుగ కూడవలయు నను
   కనులు, చెవులు, పలుకులు, ప్రాణంబులు
సకలేంద్రియములు, సకలశక్తి సక
   లంబు బ్రహ్మమయ మౌపనిషదమిది,
నే నెన్నడు విడనాడను బ్రహ్మను,
   బ్రహ్మ నన్ను విడనాడ దెన్నడును,
వీడ నేను, విడనాడరాదు నను,
   ఆత్మతత్త్వ మనవరతము నా మది
నెలకొల్పుచు నెలకొనవలె, నిత్యము
   నెలకొనవలె నుపనిషత్సూక్తులు.

* * *

## 1

ఎవరి పంపున ఇచటి కేతెంచు మనసు?
ఎవరు కూర్చగ ప్రాణంబు లవని గూడు?
ఎవరు పలికించగా పల్కు నిచట వాక్కు?
కనుల వీనుల కెవడు సంగతిని కూర్చు. 1

చెవికి చెవి యది, చిత్తంబు చిత్తమునకు,
వాక్కునకు వాక్కు, ప్రాణంబు ప్రాణమునకు,
నేత్రమునకది నేత్రంబు, నిపుణమతులు
దాని గని పృథ్వి నమరులై తరలుచుంద్రు. 2

కనులు చననేర, వచటకు చనదు వాక్కు,
మనసు చొరరాని నెలవది జనులు దాని

యథైత దనుశిష్యాత్,
అన్యదేవ తద్ విదితా దథో అవిదితాదధి --
ఇతి శుశ్రుమ పూర్వేషాం
యే న స్తద్ వ్యాచచక్షిరే.

యద్వాచాఽనభ్యుదితం
  యేన వాగభ్యుద్యతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
  నేదం యదిద ముపాసతే.

యన్మనసా న మనుతే
  యేనాహు ర్మనో మతం,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
  నేదం యదిద ముపాసతే.

యచ్చక్షుషా న పశ్యతి
  యేన చక్షూంషి పశ్యతి,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
  నేదం యదిద ముపాసతే. ౬

యచ్ఛ్రోత్రేణ న శృణోతి
  యేన శ్రోత్రమిదం శ్రుతం,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
  నేదం యదిద ముపాసతే. 7

యత్ప్రాణేన న ప్రాణితి
  యేన ప్రాణః ప్రణీయతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
  నేదం యదిద ముపాసతే. 8

తెలిపికొనలేరు, తెలిపిన తెలియరాదు,
తెలిపి తెలియనిదాని కతీత మనుచు
తెలుపగా తొంటి వింటిమి తెలియువారు. 3

వాక్కుచే దాని ప్రవచింప వలనుకాదు,
అదియె వాక్కున కభ్యుదయంబు కూర్చు,
అరయుగా నదె బ్రహ్మ, మన్యంబు కాదు,
జనులు సేవించు నిది ఉపాస్యంబు కాదు. 4

తలపులకు దాని తలపోయ తరముకాదు,
వెలయు దాననె మనసున తలపులెల్ల-
అరయుగా నదె బ్రహ్మ, మన్యంబు కాదు,
జనులు సేవించు నిది ఉపాస్యంబు కాదు. 5

కాంచవలెనన్న కనులకు కానరాదు,
కనులు దానవె సకలంబు కాంచు భువిని,
అరయుగా నదె బ్రహ్మ, మన్యంబు కాదు,
జనులు సేవించు నిది ఉపాస్యంబు కాదు. 6

ఆలకించగ వీనుల కలవి గాదు,
దాననే ఆలకించును వీను లవని,
అరయుగా నదె బ్రహ్మ, మన్యంబు కాదు,
జనులు సేవించు నిది ఉపాస్యంబు కాదు. 7

ప్రాణశక్తికి స్పందించు ప్రాణి కాదు
ప్రాణముల కది ప్రాణనాస్పదము, కాని
అరయుగా నదె బ్రహ్మ, మన్యంబు కాదు,
జనులు సేవించు నిది ఉపాస్యంబు కాదు. 8

## 2

యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి
నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపం,
యదస్య త్వం యదస్య దేవేష్వథ ను
మీమాంస్యమేవ తే, మన్యే విదితమ్. 1

నాహం మన్యే సువేదేతి,
నో న వేదేతి, వేద చ,
యో నస్తద్వేద తద్వేద
నో న వేదేతి వేద చ. 2

యస్యామతం తస్య మతం
మతం యస్య న వేద సః,
అవిజ్ఞాతం విజానతాం
విజ్ఞాత మవిజానతాం. 3

ప్రతిబోధవిదితం మతం-
అమృతత్వం హి విందతే,
ఆత్మనా విందతే వీర్యం
విద్యయా విందతే (అ)మృతమ్. 4

ఇహ చే దవేదీ దథ సత్యమస్తి
న చే దిహావేదీ న్మహతీ వినష్టిః,
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవంతి. 5

# 2

తెలియు ననుకొన్నచో, నీవు తెలిసికొన్న
బ్రహ్మతత్త్వమ్ము లేశమాత్రమ్ము సుమ్ము,
నిజము పరికించ నీవును నిర్జరులును
తెలిసికొన్నది కొద్ది, సందిగ్ధ మదియు. 1

ఎరుగుదును లెస్స యంచు భావించరాదు
ఎరుగ ననియును పలుకరా దెరిగి యుంట,
ఎరుక గలవాడె అన్నింటి నెరుగు, నిజము
ఎరుగుటయు కాదు, కాదది ఎరుగకుంట. 2

మనన మెరుగని మనసిరి కనును దాని
మననమున మున్గువాడు కన్గొనడు నిజము
తెలియుననుకొన్న వానికి తెలియరాదు
తెలియదనుకొన్న వానికి తెలియనగును. 3

ఇదియె ప్రతిబోధ విదిత మభీప్సితంబు
అందుకొని దీని నమరత్వ మొందు నరుడు
ఆత్మవైభవ మొసగు వీర్యాభినిరతి
అమరు నొనరించు నరుని విద్యానురక్తి. 4

దేహముండగనే దీని తెలియవలయు
లేని నా డది తీరని హాని యగును
సకల భూతములం దాత్మసార మరసి
అమరు లగుదురు బుధులు లోకాంతరముల. 5

## 3

బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే,
తస్య హ బ్రహ్మణో విజయే
దేవా అమహీయంత,
త ఐక్షంతాస్మాక మేవాయం
విజయో (అ)స్మాకమేవాయం మహిమేతి. 1

తద్ధైషాం విజజ్ఞౌ, తేభ్యో హ
ప్రాదుర్బభూవ, త న్న వ్యజానంత
కిమిదం యక్షమితి. 2

తే (అ)గ్ని మబ్రువన్, జాతవేద
ఏతద్విజానీహి కిమిదం యక్షమితి,
తథేతి.
తదభ్యద్రవత్, తమభ్యవదత్
కో (అ)సీత్యగ్నిర్వా అహమస్మీత్యబ్రవీత్. 3

జాతవేదా వా అహమస్మీతి,
తస్మిన్ త్వయి కిం వీర్యమితి,
అపీదం సర్వం దహేయం
యదిదం పృథివ్యామితి. 4

తస్మై తృణం నిదధా వేతద్దహేతి,
తదుపప్రేయాయ సర్వజవేన
తన్న శశాక దగ్ధుం, స తత ఏవ
నివవృతే, నై తదశకం విజ్ఞాతుం
యదేతద్ యక్షమితి. 5

# 3

దేవతలను గెలిపించెను బ్రహ్మము
గెలిచితిమని తలపోసిరి విబుధులు
సాధించితి మీ విజయ మనుచు భా
వించిరి సురలీ ఘనత తమదె యని. 1

ఈ విషయము గమనించిన బ్రహ్మము
ఆవిర్భావము పొంది అచట ప్ర
త్యక్షమయ్యె నొక యక్షరూపమున
తెలియదయ్యె ఆ రూప మెవ్వరికి. 2

అపుడగ్నిని పిలిపించిరి వారలు
తెలిసికొనుటకా యక్షు డెవరో? యని,
సమ్మతించి అత డరిగె నచ్చటకు,
అడిగె నతని నా రూప మెవరవని. 3

నే నగ్నిని, నను జాతవేదుడని
చెప్పుకొందురని చెప్పె నగ్నియును,
ఏమి చేయగల వీవని యడుగగ
ఇల నన్నియు దహియింప నేర్తుననె. 4

గడ్డిపోచ నట వైచి కాల్చుమని
పలుక, నురికి యత్నించె నగ్నియును
తిరిగి వచ్చె తుద కలవిగాక, ఆ
యక్షు డెవరొ తెలియగ రాదాయెను. 5

అథ వాయు మబ్రువన్
వాయ వేతద్ విజానీహి
కిమేతద్ యక్షమితి,
తథేతి. 6

తదభ్యద్రవత్, తమభ్యవదత్
కో (అ)సీతి- వాయుర్వా అహమస్మీ
త్యబ్రవీ న్మాతరిశ్వా వా అహమస్మీతి,
తస్మిన్ త్వయి కిం వీర్యమితి?
అపీదం సర్వమాదదీయం
యదిదం పృథివ్యా మితి. 7

తస్మై తృణం నిదధా వేతదాదత్స్వేతి,
తదుపప్రేయాయ సర్వజవేన,
తన్న శశాకాదాతుం, స తత ఏవ నివవృతే
నైతదశకం విజ్ఞాతుం
యదేతద్ యక్షమితి. 8

అథేంద్రమబ్రువన్, మఘవన్నేతద్
విజానీహి, కిమేతద్ యక్షమితి,
తథేతి, తదభ్యద్రవత్, తస్మాత్ తిరోదధే. 9

స తస్మిన్నేవాకాశే స్త్రియ మాజగామ
బహు శోభమానా ముమాం హైమవతీం,
తాం హోవాచ, కిమేతద్ యక్షమితి. 10

అపుడు వాయువును పంపిరి వారలు
తెలిసికొనుట కా యక్షు డెవరో యని,
సమ్మతించి అత డరిగె నచ్చటకు,
అడిగె నతని నా రూప మెవరవని. 6

నే వాయువు, నను మాతరిశ్వ యని
చెప్పుకొందురని చెప్పె వాయువును,
ఏమి చేయగల వీవని యడుగగ,
ఇల నన్నిటి నే నెగయ నేర్తునవె. 7

గడ్డిపోచ నిడి ఎగురవేయుమని
పలుక, నురికి యత్నించె వాయువును,
తిరిగి వచ్చె తుద కలవిగాక, ఆ
యక్షు డెవరో తెలియగ రాదాయెను. 8

అపు డింద్రుని అర్థించిరి వారలు
తెలిసికొనుట కా యక్షు డెవరో యని,
అరిగె నతడు, నాతని గనినంతనె
మాయమయ్యె మాయామయ రూపము. 9

గగనవీథి నక్కజముగ నచటనె
వెలసె నొక్క యోషిత, శోభామయి
తుహినాచల తనయాన్వితతను ఉమ-
అడిగె నామె నమరేంద్రుడు; "దేవీ!
ఎవర వీవు? యక్షాకృతి యే" మని. 10

# 4

సా బ్రహ్మేతి హోవాచ,
బ్రహ్మణో వా ఏతద్విజయే మహీయధ్వమితి,
తత్ హైవ విదాంచకార బ్రహ్మేతి. 1

తస్మాద్వా ఏతే దేవా అతితరామివాన్యాన్
దేవాన్, యదగ్ని ర్వాయు రింద్రస్తే
హ్యేనన్నేదిష్ఠం పస్పర్శుస్తే హ్యేనత్
ప్రథమో విదాంచకార బ్రహ్మేతి. 2

తస్మాద్వా ఇంద్రో (అ)తితరామివాన్యాన్
దేవాన్, సహ్యేనన్నేదిష్ఠం పస్పర్శ,
స హ్యేనత్ ప్రథమో విదాంచకార బ్రహ్మేతి-
తస్యైష ఆదేశో యదేతత్
విద్యుతో వ్యద్యుతదా
ఇతీన్ న్యమీమిషదా-ఇత్యధిదైవతమ్. 3

అథాధ్యాత్మం యదేత ద్గచ్ఛతీవ చ
మనో (అ)నేన చైత దుపస్మరత్యభీక్ష్ణం
సంకల్పః. 4

తద్ధ తద్వనం నామ
తద్వన మిత్యుపాసితవ్యం,
స య ఏతదేవం వేదాఽభిహైనం
సర్వాణి భూతాని సంవాంఛంతి. 5

## 4

ఆ లలామ వివరించె బ్రహ్మమని
మీ జయమున కాధారము బ్రహ్మము,
ఆ మాటలు వినినంతనె సకలము
బ్రహ్మమయంబుగ తోచె నింద్రునకు. 1

అగ్రగణ్యులయి రందువలన సుర
జాతికి అగ్నియు, వాయువు, ఇంద్రుడు
చెంతనుండి తొలుదొల్త బ్రహ్మమును
తెలిసికొనిరి కని ప్రత్యక్షంబుగ. 2

అందు నింద్రు డత్యంత సన్నిహిత
ముగ గాంచెను మున్ముందు తెలిసికొని,
మెరపు మెరయ భాసించును, రెప్పలు
వాలగ నగు నంతర్హిత మా ఛవి. 3

అధిదైవతమగు బ్రహ్మభావ మది
ఆధ్యాత్మికముగ దాని గాంచి మది
అనుసరించు స్మరియించును సతతము
సహకరించు సంకల్ప శుద్ధియును. 4

అది తదీయ భావన, తద్వనమది,
సకల జనారాధ్యము తద్వన రుచి,
దాని నెరిగి తన్మయుడగువానిని
ప్రాణికోటి వాంఛించి కొలుచు నిల. 5

ఉపనిషదం భో బ్రూహీత్యుక్తా
త ఉపనిషద్ బ్రాహ్మీం వావ
త ఉపనిషద మబ్రూమేతి. 6

తస్యై తపో దమః
కర్మేతి ప్రతిష్ఠా వేదాః
సర్వాంగాని
సత్య మాయతనమ్. 7

యో వా ఏతా మేవం
వేదాపహత్య పాప్మానం-
అనంతే స్వర్గే లోకే జ్యేయే
ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి. 8

* * *

ఓం ఆప్యాయంతు మమాంగాని
వాక్ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథో
బల మింద్రియాణి చ సర్వాణి,
సర్వం బ్రహ్మోపనిషదం
మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం
మా మా బ్రహ్మ నిరాకరోత్
అనిరాకరణ మస్త్వనిరాకరణం మే (అ)స్తు,
తదాత్మని నిరతే య ఉపనిషత్సు
ధర్మా స్తే మయి సంతు, తే మయి సంతు.

*ఓం శాంతిః శాంతిః శాంతిః.*

ఉపనిషత్తు వివరించి చెప్ప డన
వివరించితినని తెలిపె దేశికుడు,
ఉపనిషత్తు బ్రాహ్మీమయ మట్టిది
తెలియపరచె తెలిపితినని తెలుపరి. 6

తపోనిష్ఠ, దమసంపద, కర్మో
పాసన దానికి మూలకందములు,
వేదములే అవయవములు దానికి,
సత్య మాయతన మగు నా విద్యకు. 7

దాని తత్త్వమిటు లామూలాగ్రము
తెలిసికొన్న, తొలగును పాపౌఘము,
మహనీయుంబగు స్వర్గలోకమున
వెలయు నతడు, శాశ్వతముగ వెలయును. 8

* * *

ఆప్యాయుంబుగ కూడవలయు నను
కనులు, చెవులు, పలుకులు, ప్రాణంబులు
సకలేంద్రియములు, సకల శక్తి సక
లంబు బ్రహ్మమయ మౌపనిషద మిది,
నే నెన్నడు విడనాడను బ్రహ్మను,
బ్రహ్మ నన్ను విడనాడ దెన్నడును,
వీడ నేను, విడనాడరాదు నను,
ఆత్మతత్త్వ మనవరతము నా మది
వెలకొల్పుచు నెలకొనవలె, నిత్యము
నెలకొనవలె నుపనిషత్ప్రోక్తులు.

* * *

# సారాంశం

వేదవాఙ్మయానికి ఋగ్వేదం పునాది. అనాది సృష్టికి ఆదిని ఊహించి వివరించిన ఐతరేయం ఈ ఋగ్వేదానికి సంబంధించిన ఆరణ్యకంలో ఒక భాగం. ఈశావాస్యం మంత్రభాగం, కేనోపనిషత్తు బ్రాహ్మణ భాగం కాగా, ఈ ఐతరేయం ఆరణ్యకభాగం కావటం వల్ల, వేద వాఙ్మయానికి చెందిన ఈ మూడు శాఖలతో ఈ మూడు ఉపనిషత్తుల ద్వారా ప్రత్యక్ష పరిచయం ఏర్పడుతుంది.

'ఐతరేయ' మంటే ఇతర సంబంధమయినదని శబ్దార్థం. 'దేనికి ఇతరం' అని ఆలోచిస్తే దీనిలోని గూఢమైన అర్థం గోచరిస్తుంది. మనకు తెలిసినది, మనం చూచేది, వినేది, భావించేది, వాంఛించేది శుద్ధ పార్థివమైన ఈ సృష్టి. ఇది కానిది, దీనికి మూల మైనది, అన్నింటికి ఆదికారణమై అన్నింట వ్యాపించి ఉండేది ఆద్యంత రహితమైన ఆత్మతత్త్వం: ఆత్మనుండి అఖిలాండకోటి ఉదయించింది. సంకల్ప మాత్రం చేత ఆద్యచైతన్యం సమస్త లోకాలను ఆలోకంతో, ఆకారంతో, ఆహారంతో, ఆహ్లాదంతో, అనిర్వచనీయమైన ఆనందంతో నింపింది. ఇది ఎలా జరిగింది? అనే విషయం ఈ ఉపనిషత్తులో వివరించటం వల్ల, దీనికి ఐతరేయ-ఉపనిషత్తు అని పేరు వచ్చింది. సాకారమైన శరీరానికి ఇతరమైన, నిరాకార నిరంజన నిర్లిప్త నిరుపాధికమైన ఆత్మతత్త్వం ఇందులో ప్రతిపాద్యమైన విషయం.

సృష్ట్యాదిలో ఆత్మ ఒకటే ఉంది. లోకాలను వెలయించాలని ఆత్మకు అభిలాష కలిగింది. వెంటనే సప్తలోకాలు, లోకపాలకులు, లోకాలోకం, ఆకారం, కండ్లు, చెవులు, ముక్కులు, చర్మం, రోమరాజి, హృదయం, మనస్సు, పంచప్రాణాలు, పంచభూతాలు, అన్నీ ఒకటి వెంట మరొకటి ఏర్పడ్డాయి. బయట వ్యాపించిన ఆకాశం, గాలి, నిప్పు, నీరు, మట్టి లోపల కూడా తగిన తావున చోటు చేసుకున్నాయి. అగ్ని వాగ్రూపంలో నోటిలో

ప్రవేశించింది. వాయువు శ్వాసరూపంలో నాసికలను చేరుకున్నది. దిక్కులు శబ్దరూపంలో చెవులలో చేరాయి. ఓషధులు రోమ రూపంలో చర్మంలో కూడుకున్నాయి. చంద్రుడు మనోరూపంలో హృదయంలో ప్రవేశించాడు. సూర్యుడు కండ్లలో చేరాడు. ఇలా సర్వాంగ సుందరమైన మానవశరీరం ఏర్పడ్డది.

ఆ తర్వాత శరీరానికి తగిన ఆహారం ఏర్పడ్డది. ఆకలిదప్పులకు తగిన ఆహారం రూపొందిందే గాని, దాన్ని గ్రహించేందుకు ఏ అవయవం సిద్ధం కాలేదు. కండ్లకు తినటం చేతగాలేదు. చెవులకు కూడా ఆహారం పనికి రాలేదు. చర్మానికి, నాసికలకు, మనస్సుకు, ప్రాణానికి -- దేనికీ ఆహారం గ్రహించటం సాధ్యం కాలేదు. చివరికి అపానవాయువు చటుక్కున ఆహారాన్ని గ్రహించ గలిగింది. మృత్యువు అపానవాయువును ఆశ్రయించి ఆహారం తీసుకోసాగింది.

కాని ఇన్నింటిని కల్పించుకున్న ఆత్మకు ఈ శరీరంలో చోటు దొరకలేదు. నవరంధ్రాలనుండి నానాతత్త్వాలు ప్రవేశించగా, ఆత్మకు లోపల ప్రవేశించేందుకు దారిలేక నలు వైపుల తేరిపార చూచింది. చివరకు తలనడుమ మాడులో నుండి చిన్న రంధ్రం చేసుకొని ఎలాగో లోపలికి ప్రవేశించింది. ఆత్మకు అంతర్యాన్ని ప్రసాదించిన ఈ బ్రహ్మరంధ్రమే, ఆనందనిలయమై లోపలికి చీల్చుకొనిపోయిన ఆత్మకు ముచ్చటయిన మూడు గుర్తులు చూపించింది. ఆ మూడుచోట్లు ఒకదానితో ఒకటి పెనవేసికొని ముద్దులు మూట గట్టినట్టు ఆత్మకు ఆలయం కల్పించాయి. ఆలయాలు ఆత్మకు అంతులేని హాయిని చేకూర్చాయి. బుజ్జిపాపకు జోలపాడి జోకొట్టినట్టుగా ఆ మూడు గురుతులు ఆత్మకు లాలిపాట పాడి త్రిజటా స్వప్న సౌందర్యంతో నిర్లిప్తమైన ఆత్మను నిదురపుచ్చాయి. నిదురించిన ఆత్మకు ఎదురుగా మేల్కొన్న మరో జీవి అక్కడనే అంతకుముందే ప్రవేశించియున్నాడు. అప్పుడు వారికిద్దరికి పరస్పర పరిచయం ఏర్పడింది. పరిచయం అన్యోన్యానురాగంగా మారింది. ఇలా జీవాత్మ పరమాత్మకు అత్యంత సన్నిహితంగా

ఉంటూనే తనది కాని తనువును తన దనుకోవటంవల్ల తనదయిన తత్త్వంతో తాదాత్మ్యం పొందలేక తహ తహ లాడసాగింది.

ఇంతటితో ఈ ఉపనిషత్తులోని మొదటి అధ్యాయం పూర్తి అవుతుంది. రెండవ అధ్యాయంలో మూడు రకాల మానవజన్మలను గురించిన వివరం ఆరు మంత్రాల్లో వర్ణించబడుతుంది. తల్లి దండ్రులకు తనయుడుగా జన్మించటం మొదటిజన్మ. పూర్వజన్మ సంస్కారంతో పాటు స్వాధ్యాయ సాధనను మేళవించుకొని, తనను గుర్తించి తెలుసుకుని, తగినరీతిని జీవించి భావించటం రెండోజన్మ. తనివిదీర జీవించి, తన తనయులకు జీవితశేషం అప్పగించి, మరో తనువును సేకరించటం మూడో జన్మ. ఈ మూడు జన్మలను ఒకే జన్మలో తల్లి గర్భంలో ఉండగానే అవగాహనం చేసుకున్న వామదేవుడులాంటి పుణ్యాత్ములు ధన్యులు. తనువు తనతో ఉండగానే, ఈ తనువు తాను కాదని, దానిని మించిన తత్త్వం మరొకటి ఉన్నదని తెలుసుకొన్న మహనీయులకు భవబంధన ముండదు. అలాంటి జీవన్ముక్తులకు ఈ ఆత్మతత్త్వం అద్దం పట్టినట్టు అవగతమవుతుంది.

మూడో అధ్యాయంలో ఈ ఆత్మానాత్మ వివేచన జరుగుతుంది. ఆత్మ యేమిటి? అనాత్మ యేమిటి? కండ్లతో చూచేది, చెవులతో వినేది, ముక్కులతో మూర్కొనేది, వాక్కుతో పలికేది, రుచి చూచేది, తలపోసేది, వాంఛించేది, భావించేది, బోధించేది, బోధపరచుకునేది ఇవన్నీ ఆత్మ లక్షణాలే కాని, ఆత్మకాదు. వీటిలోనూ, వీటికి మూలమైన పంచ మహాభూతాలలోనూ నెలకొని యున్న ప్రజ్ఞానమే ఆత్మ. అదే బ్రహ్మ. ప్రజ్ఞానమే బ్రహ్మ. ప్రపంచమంతా ప్రజ్ఞానమయం. బ్రహ్మ స్వరూపం. అదే ఐతరేయం. ఇది కాదు. అదే అన్నింటికి ఆది.

ఈ ఆదిని తెలుసుకొనేందుకు ఈ ఉపనిషత్తు మొదట, చివర శాంతిపాఠం దారి చూపిస్తుంది. ప్రాపంచిక పరిధుల్లో ప్రాకు లాడే ప్రాణికోటికి ప్రజ్ఞానం లభించాలంటే ఒకే ఒక మార్గం ఉంది.

వాక్కు మనస్సులో ఐక్యమై పోవాలి. మనస్సు వాక్కులో స్థిరంగా ఉండాలి. అప్పుడే పరమాత్మ స్వరూపం బోధపడుతుంది. పరమతత్త్వాన్ని బోధపరచుకొనేందుకు వాక్కుగాని, మనస్సుగాని వేరువేరుగా ప్రయత్నిస్తే ప్రయోజనం లేదు. ఎంత దూరం పయనించినా వాక్కు, మనస్సు గమ్యస్థానాన్ని చేరుకోలేవు. కాని, రెండూ కలపి అన్యోన్యానురాగంతో ఈ ప్రయాణం సాగిస్తే క్షణంలో తత్త్వం తెలిసిపోతుంది. ఈ రెండింటి సామరస్యాన్ని సాధించుకొనేందుకే జపాలు, తపాలు, పూజలు, పునస్కారాలు, యజ్ఞాలు, యాగాలు, వేదాలు, వేదాంతాలు--అన్నీ ఉపయోగపడుతాయి. దాన్ని సాధించ లేనివి అన్నీ వ్యర్థమే. కాబట్టి అక్షర సందీప్తిని అందించే వాక్కుతో, మహనీయులకు మననీయమైన మనస్సు మేళవించాలి. అదే ఆధ్యాత్మిక సాధనకు పునాది, ఆది.

* * *

# ఐతరేయం
## (మూలం)

ఓం వాఙ్ మే మనసి ప్రతిష్ఠితా
మనో మే వాచి ప్రతిష్ఠితం-
ఆవి రావి ర్మ ఏధి,
వేదస్య మ ఆణీస్థః
శ్రుతం మే మా ప్రహాసీః
అనేనాధీతేనాహోరాత్రాన్ సందధామి,
ఋతం వదిష్యామి,
సత్యం వదిష్యామి,
తన్మా మవతు
త ద్వక్తార మవతు,
అవతు మాం
అవతు వక్తారం.

*ఓం శాంతిః శాంతిః శాంతిః.*

## మొదటి అధ్యాయం

### 1

ఓం ఆత్మా వా ఇదమేక
ఏవాగ్ర ఆసీత్
నాన్యత్ కించన మిషత్,
స ఈక్షత లోకాన్ను సృజా ఇతి.

# ఆది
## (అనువాదం)

ఓంకారము వాఙ్మయమయి
నెలకొనవలె నా మనమున
మనసు కూడ వాఙ్మయమయి
నెలకొనవలె నా పలుకున
తరలి రమ్ము నను చేరగ
తెమ్ము వేద నవనీతము
విన్నది నను విడనాడక
పవలు రేయి కలుపనిమ్ము
పలుకనిమ్ము ఋతము నన్ను
నిజము నన్ను పలుకనిమ్ము
పలికిన నను బ్రోవవలయు
పలికించిన వాని బ్రోచి
పలికి పలుకరించిన మము
బ్రోచుత మా వాఙ్మనములు.

* * *

## మొదటి అధ్యాయం
### 1

చెలగె నాత్మ తొలుత నొండె
చెంత వేరు కాంతి లేక
నీరవముగ నిర్జనమున
నిర్నిమేష నిరయనమున
జన జీవనమును రచింప
సంకల్పించినది ఆత్మ.

స ఇమాన్ లోకా నసృజత-
అంభో మరీచీ ర్మర మాపో (అ)దో (అ)ంభః
పరేణ దివం, ద్యౌః
ప్రతిష్ఠాంతరిక్షం
మరీచయః,
పృథివీ మరో,
యా అధస్తాత్
తా ఆపః. 2

స ఈక్షతే మే ను
లోకా లోకపాలాన్ను
సృజా ఇతి,
సో (అ)ద్భ్య ఏవ
పురుషం
సముద్ధృత్యామూర్ఛయత్.
తమభ్యతపత్
తస్యాభితప్తస్య ముఖం నిరభిద్యత,
యథాండం,
ముఖా ద్వాగ్, వాచో (అ)గ్నిః. 3

నాసికే నిరభిద్యేతాం,
నాసికాభ్యాం ప్రాణః,
ప్రాణాద్వాయుః
అక్షిణీ నిరభిద్యేతాం 4

వెలుగ పొగినవి దివిపయి,
మెలమెల్లగ మహర్లోక
జనోలోక తపోలోక
సత్యలోక మంభస్సులు
అంతరిక్షమున మరీచి
మర్త్యలోకములు వెలసెను.
పాతాళమునందు వెలసె
పార్థివ పాథో జగత్తు
లోకములను వెలయించిన
ఆలోకము తలపోసెను. 2

లోక పాలకులను గూడ
నెలకొల్పుట భావ్యమ్మని
నీటినుండి మేటి యైన
బోటి నొకటి బయలు పరచి,
ఆ పురుషాకృతిని గూర్చి
ఆలోచన చేసె నాత్మ
ఆ తపస్సునకు తపించి
అండమువలె వెలసె ముఖము,
ముఖమునుండి వాక్కు వెడలె,
వాక్కునుండి వెలసె నగ్ని. 3

అందుదయించినవి రెండు
నాసాపుటములు జంటగ,
వాని నుండి వెలువడినది
ప్రాణవాయువగు శ్వాసము. 4

అక్షిభ్యాం చక్షుః
చక్షుష ఆదిత్యః
కర్ణా నిరభిద్యేతాం,
కర్ణాభ్యాం శ్రోత్రం
శ్రోత్రాద్దిశః. 5

త్వజ్ నిరభిద్యత,
త్వచో లోమాని
లోమభ్య ఓషధి వనస్పతయో,
హృదయం నిరభిద్యత. 6

హృదయా న్మనో,
మనస శ్చంద్రమా,
నాభి ర్నిరభిద్యత
నాభ్యా అపానః.-- 7

అపానా న్మృత్యుః
శిశ్నం నిరభిద్యత,
శిశ్నా ద్రేతో
రేతసః ఆపః. 8

నిగనిగలాడుచు వెలువడె
నేత్రగోళముల యుగళము,
ఆ కనుగవ వెలువరించె
తళతళ రవి కిరణ కాంతి,
పాటమరించె రెండు చెవులు,
శ్రవణ పుటములందు కూడి
చెవులనుండి వెడలిన శ్రుతి
దశ దిశలను ప్రసరించెను. 5

అపుడు తనువు వెడలె, నందు
వెలువడినవి రోమమ్ములు,
రోమములే ఓషధులయి
అవనిని వనమయము చేసె,
అంతట వెడలినది యెడద. 6

ఎద నుదయించినది మనసు,
మనసు చందురుని కూర్చెను
నాభి ప్రస్ఫుటించె నంత,
అం దపాన వాయువుగా. 7

మృత్యు వొదిగి యుండె పొంచి,
అటు పిమ్మట రూపొందెను
గుహ్యేంద్రియ, మందు వెలసె
రేతో చైతన్య రాశి
సలిలములకు నిలయ మగుచు. 8

## 2

తా ఏతా దేవతాః సృష్టా
అస్మి న్మహత్యర్ణవే
ప్రాపతం స్తం
అశనాయా పిపాసాభ్యా మన్వవార్జత్,
తా ఏన మబ్రువన్-
ఆయతనం నః ప్రజానీహి,
యస్మిన్ ప్రతిష్ఠితా
అన్నమదామేతి.

తాభ్యో గా మానయత్-
తా అబ్రువన్
న వై నో (అ)య మల మితి,
తాభ్యో (అ)శ్వ మానయత్.

తా అబ్రువన్-
న వై నో (అ)య మల మితి
తాభ్యః పురుష మానయత్.

తా అబ్రువన్
సుకృతం బతేతి,
పురుషోవావ సుకృతం
తా అబ్రవీత్-
యథాయతనం ప్రవిశతేతి.

# 2

ఈ విధముగ రూపొందిన
దేవత లందరును గూడి
పుడమి కడలి యొడి చేరిరి
అది మహా సముద్రమయ్యె,
ఆకలి కూడినది అచట
దానికి లోనయిరి సురలు,
మాకు మంచి తావు చూపి
ఆకలి దప్పులను తీర్చి
ముక్తి ప్రసాదించు మనుచు
మొర పెట్టిరి సురలాత్మకు.

అంత వారి కంతరాత్మ
చూపించెను గోరూపము
అది సరిలేదనిరి వారు
అంతట వెలువడెను హయము.

అదియు కూడ సరిలేదని
విన్న వించుకొనిరి వారు
అంతట వెలయించె నాత్మ
పురుష రూపమున కాయము.

సరి సరి యని సమ్మతించి
సంతసించి రాకృతి గని
పురుషాకృతి సుభగాకృతి
ఇది అంగీకార్య మనిరి
అనుగుణముగ అయ్యెయెడ
అందరి నమరించె నాత్మ.

అగ్ని ర్వాగ్ భూత్వా
ముఖం ప్రావిశత్-
వాయుః ప్రాణో భూత్వా
నాసికే ప్రావిశత్,

ఆదిత్య శ్చక్షు ర్భూత్వా అక్షిణీ ప్రావిశత్-
దిశః శ్రోత్రం భూత్వా
కర్ణౌ ప్రావిశన్-
ఓషధి వనస్పతయో
లోమాని భూత్వా
త్వచం ప్రావిశన్-

చంద్రమా మనో భూత్వా
హృదయం ప్రావిశత్-
మృత్యు రపానో భూత్వా
నాభిం ప్రావిశత్-
ఆపో రేతో భూత్వా
శిశ్నం ప్రావిశన్.

త మశనాయా పిపాసే అబ్రూతాం-
ఆవాభ్యా మభిప్రజానీహీతి,
తే అబ్రవీద్-
ఏతా స్వేవ వాం దేవతాస్వా భజామి-
ఏతాసు భాగిన్యౌ కరోమీతి.
తస్మాద్యస్యై కస్యై చ
దేవతాయై హవి ర్గృహ్యతే
భాగిన్యావేవాస్యా
మశనాయా పిపాసే భవతః.

తొలుత నగ్ని ప్రవేశించె
వాగ్రూపముతో ముఖమున,
ప్రాణరూపమున వాయువు
ప్రవేశించె నాసమ్ముల;

కనుదోయిని ప్రవేశించె
కను వెలుగయి ప్రభాకరుడు,
శ్రుతి పథమున ప్రవేశించె
శ్రవణ గోళముల దిక్కులు;
సస్యము లోషధులు చేరె
రోమ రూపమున తనువును;

మానస రూపమున చేరె
సుధాకరుడు హృదయసీమ,
నాభి వివరమున చేరెను
మృత్యు వపు డపానగతిని,
రేతో రూపమున జలము
గుహ్యేంద్రియమున జేరెను.

అందరు అందందు చేర
ఆకలిదప్పికలు కూడ
తమకు నెలవు చూపు మనుచు
అర్థించెను యజమానిని,
అచ్చటనే చోటుచేసి
అనువగు తావరము చూపి
దివిజులతో సహజీవన
సహభాగము సంస్కరించి
క్షుత్పిపాసలకు సయితము
శాంతి సౌఖ్యములు కూర్చెను.

# 3

స ఈక్షతే మే ను
లోకాశ్చ లోకపాలాశ్చ-
అన్నమేభ్యః సృజా ఇతి.

సో (అ)పో (అ)భ్యతపత్-
తాభ్యో (అ)భితప్తాభ్యో
మూర్తి రజాయత,
యా వైసా మూర్తి రజాయత -
అన్నం వై తత్.

తదేతత్ అభిసృష్టం
పరాఙ్త్యజిఘాంసత్.
తద్వాచాజిఘృక్షత్,
తన్నాశక్నోద్వాచా గ్రహీతుం,
స యద్ధైన ద్వాచాగ్రహైష్యద్
అభివ్యాహృత్య హైవాన్న మత్రప్స్యత్.

తత్ప్రాణేనాజిఘృక్షత్,
తన్నాశక్నోత్ ప్రాణేన గ్రహీతుం
స యద్ధైనత్ ప్రాణేనాగ్రహైష్యద్
అభిప్రాణ్య హైవాన్న మత్రప్స్యత్.

# 3

లోకమ్ములు లోకేశులు
ప్రాకటముగ వెలయు నపుడు
వారి కన్నపానములను
వనరుల సమకూర్చ నెంచి
ఆత్మ సలిలములను గూర్చి
ఆచరించె దీర్ఘ తపము,
తపస్సునకు తపించి జలము
వెలువరించె నొక రూపము,
ఆ విధముగా వెలసిన
ఆకృతియే అన్నమయ్యె.

కాని అన్న మతని గాంచి
పెడముఖమున వెడలసాగె,
అతడు దాని పలుకులతో
పట్టుకొనగ ప్రాకులాడె.
కాని అతని పలుకుల కది
చిక్కలేదు-చిక్కినచో
అన్న మన్న మాత్రముననె
మన కాకలి తీరియుండు.

అంత అన్నమును మూర్కొని
ఆరగించ చూచె నతడు,
ముక్కుల కది చిక్కలేదు
ముక్కులకే చిక్కినచో
అఘ్రాణము చేసినంత
అప్యాయము కలిగియుండు.

త చ్చక్షుషాఽజిఘృక్షత్
తన్నాశక్నో చ్చక్షుషా గ్రహీతుం.
స యద్ధైన చ్చక్షుషాగ్రహైష్యద్
దృష్ట్వా హైవాన్న మత్రప్స్యత్.

తచ్ఛ్రోత్రేణాజిఘృక్షత్,
తన్నాశక్నో చ్ఛ్రోత్రేణ గ్రహీతుం,
స యద్ధైన చ్ఛ్రోత్రేణాగ్రహైష్యత్ -
శ్రుత్వా హైవాన్న మత్రప్స్యత్.

తత్ త్వచాఽజిఘృక్షత్,
తన్నాశక్నోత్ త్వచా గ్రహీతుం,
స యద్ధైనత్ త్వచాఽగ్రహైష్యత్
స్పృష్ట్వా హైవాన్న మత్రప్స్యత్.

తన్మనసాఽజిఘృక్షత్,
తన్నాశక్నోన్మనసా గ్రహీతుం,
స యద్ధైన న్మనసాఽగ్రహైష్యద్,
ధ్యాత్వా హైవాన్న మత్రప్స్యత్.

అంతట కనుదోయితోడ
ఆరగించ యత్నించెను,
కాని అలవి కాలేదది.
కన్నులె తిన నేర్చినచో
కన్నంతనె తినకుండునె?
కడుపు నిండి యుండును గద!

అంత కర్ణపుటములతో
ఆరగించ యత్నించెను,
కాని వీలు కాలేదది,
వీనులకే అందినచో
విన్నంతనె తినకుండునె?
తీరియుండు మన కాకలి.

అంతట కైదోయి చాచి
ఆరగించ యత్నించెను
కాని అలవి కాలేదది,
చేతులకే అందినచో
తాకినంత మాత్రముననె
తీరియుండు మన కాకలి.

అంతట ఆలోచనతో
ఆరగించ యత్నించెను
కాన అలవి కాలేదది,
మనసే తిన నేర్చినచో
తలచినంత మాత్రముననె
తీరియుండు మన ఆకలి.

తచ్ఛిశ్నేనాజిఘృక్షత్,
తన్నశక్నోచ్ఛిశ్నేన గ్రహీతుం,
స యద్దైన చ్ఛిశ్నేనాగ్రహైష్యద్
విసృజ్య హైవాన్న మత్రప్స్యత్.

తదపానేనాజిఘృక్షత్,
తదావయత్,
సైషోఽన్నస్య గ్రహో
యద్వాయు రన్నాయుర్వా
ఏష యద్వాయుః.

స ఈక్షత
కథం న్విదం మదృతే స్యాదితి,
స ఈక్షత
కతరేణ ప్రపద్యా ఇతి.

స ఈక్షత
యది వాచాభివ్యాహృతం,
యది ప్రాణేనాభి ప్రాణితం,
యది చక్షుషా దృష్టం,
యది శ్రోత్రేణ శ్రుతం,
యది త్వచా స్పృష్టం,
యది మనసా ధ్యాతం,
యద్యపానేనాభ్యపానితం,
యది శిశ్నేన విసృష్టం-
అథకో (అ)హ మితి

అంతట గుహ్యేంద్రియమున
ఆరగించ యత్నించెను
కాని అలవి కాలేదది,
అదియే తిన నేర్చినచో
విసర్జనము చేసినంత
తీరి యుండు మన ఆకలి.

తుద కపానవాయువుతో
ఓదనము గ్రహింప చూచె,
చిక్కినది అపానమునకు
పట్టుపడిన దన్న మటులు,
కనుకనే అపానమునకు
అన్న వాయు వని పేరట.

అంతట యోచించె నాత్మ
నేను లేని తను వదేమి?
ఏ దారిని ప్రవేశించు
తావు దొరకు నీ తనువున?

వాక్కు మాటలాడు నిచట
శ్వాస పీల్చుకొను నాసిక
కనులు సకలమును కాంచును
వీనులు నిస్వనము వినును
తనువు స్పృశించును తనువును
మనసు మననమును చేయును
తిను నపాన మన్నింటిని
విసర్జించు గుహ్యాంగము
మరి నే నే ద్వారమ్మున
ప్రవేశింతు నీ తనువున?

స ఏతమేవ సీమానం
విదా ర్యైతయా ద్వారా
ప్రాపద్యత--
సైషా
విదృతి ర్నామ
ద్వాస్తదేతన్నాందనమ్,

తస్య త్రయ ఆవసథా స్త్రయః స్వప్నాః,
అయమావసథోఽయ

మావసథోఽయ
మావసథ ఇతి,
స జాతో
భూతా న్యభివ్యైఖ్యత్,
కి మిహాన్యం
వావదిషదితి,
స ఏతమేవ
పురుషం బ్రహ్మ
తతమ మపశ్యత్
ఇద మదర్శమితీ............

తస్మా దిదంద్రో
నామేదంద్రో హ వై నామ,
తమిదంద్రం
సంత మింద్ర
ఇత్యాచక్షతే పరోక్షేణ,
పరోక్షప్రియా ఇవ హి దేవాః,
పరోక్షప్రియా ఇవ హి దేవాః.

అనుకొని పరికించి చూచి
అవరోధము నధిగమించి
అంత నంతరాత్మ చేరె
నందనమతి విదృతి గతిని
ముచ్చటగా మూడు గూళ్ళు.

కూడుకొన్నవట గురుతుగ
ఆలయ నిలయములు మూడు
త్రిజటా స్వప్నమున వెలయ
ఇది మొదటిది రెండవ దిది
ఇది మూడవదని కనుగొని
పరిసరములు పరికించిన
పరమ పురుష చైతన్యము
తన తనువును పోలిన ఒక
మహో తనువు నచట చూచి
మహానంద మాశ్చర్యము
పొంది పొంగిపోయె ద్రష్ట.

ఇట చూచితి 'నిదమిదంద్ర-
మిద మిదంద్ర మిద మిదంద్ర'
మని పలికిన దంతరాత్మ,
అదియె ఇంద్రరూపమయ్యె,
భంగ్యంతర పరులు సురలు
భంగ్యంతర పరాయణులు.

# రెండవ అధ్యాయం

పురుషే హ వా
అయమాదితో గర్భో భవతి
య దేతద్రేతః, తదేతత్
సర్వేభ్యో (అ)ంగేభ్య స్తేజః
సంభూత మాత్మన్యేవాత్మానం
బిభర్తి, తద్యదా
స్త్రియాం సించ త్యథైనన్ జనయతి
తదస్య ప్రథమం జన్మ.

తత్ స్త్రియా ఆత్మభూయం గచ్ఛతి,
యథా స్వమంగం తథా,
తస్మా దేనాం న హినస్తి,
సాస్యై తమాత్మాన మత్ర గతం
భావయతి,
సా భావయిత్రీ
భావయితవ్యా భవతి,
తం స్త్రీ గర్భం బిభర్తి,
సో (అ)గ్ర ఏవ కుమారం
జన్మనో (అ)గ్రే (అ)ధిభావయతి,
స యత్కుమారం జన్మనో (అ)గ్రే (అ)ధి
భావయతి, ఆత్మానమేవ తద్భావయతి, ఏషాం

# రెండవ అధ్యాయం

జీవుడు తొలుదొల్త వెలయు
పురుష వీర్య రూపమ్మున-
వివిధాంగములందు నిండి
వెల్లి విరియు తేజస్సున-
రేతో రూపమున జీవి
తన్ను దాను తొల్పియుండు-
అది స్త్రీగర్భమున జేర
జీవికి తొలి జన్మ యగును.

తల్లి గర్భమందు చేరి
తల్లి రక్త మాంసములను
పంచుకొనుచు పెరుగు జీవి,
తల్లి భార మని యెంచదు.
తన తనువున పెరుగుచున్న
తనయుని మోదమున గనును.

లాలి పాడి లాలించుచు
పాలించుచు పోషించును,
కన్నంతనె ప్రసవించిన
గాసి యెల్ల మరచు తల్లి.

తన్ను దాను కన్నట్టులు
తలపోయును కన్న తల్లి
లోకములను వెలయించుచు
లోక సంతతిని గూర్చును.

లోకానాం సంతత్యా - ఏవం సంతతా
హీమే లోకా స్తదస్య ద్వితీయం జన్మ.

సో (అ)స్యాయ మాత్మా పుణ్యేభ్యః
కర్మభ్యః ప్రతిధీయతే.
అథా (అ) స్యాయ మితర ఆత్మా
కృతకృత్యో వయోగతః ప్రైతి,
స ఇతః ప్రయన్నేవ పున ర్జాయతే,
తదస్య తృతీయం జన్మ.

తదుక్తం ఋషిణా -
గర్భే ను సన్నన్వేషామ వేద మహం
దేవానాం జనిమాని విశ్వా,
శతం మా పుర ఆయసీ ররక్ష న్నధః
శ్యేనో జవసా నిరదీయమితి,
గర్భ ఏవైతచ్ఛయానో
వామదేవ ఏవ ముువాచ

స ఏవం విద్వా నస్మాచ్ఛరీర
భేదా దూర్ధ్వం
ఉత్క్రమ్య ముష్మిన్ స్వర్గే లోకే
సర్వాన్ కామా నాప్త్వా (అ)మృతః
సమభవత్, అమృతః సమభవత్.

జీవ సంసరణ జగతిని
ఇది రెండవ జన్మ యగును.

తన పనులకు వారసుడగు
తనయుని ప్రతినిధిగ కూర్చి
తనువును చాలించి మరల
తన కనువుగ జన్మించును.
జనన మరణ సరణియందు
అది మూడవ జన్మయగును.

తల్లి గర్భమందె తొల్లి
వామదేవుడను ధన్యుడు
సకలమార్గ దృష్టి నరసి
సంభ్రమమున చాటె నిటులు-
జనన మరణ సంసరణము
దివిజ కల్పితము, బహుళము
పలుమారులు భవ శతముల
బంధనముల చిక్కి సొక్కి
క్షణములోన తుత్తునియలు
చేసితి నీ సంకెళ్ళను
డేగ పగిది వెలువడితిని
వేగముతో సాగుదు నిక,

భవ బంధనములు నన్నిక
బాధించవు వేధించవు.
సకల కామితార్థములను
సాధింతును స్వర్గసీమ,
నా కమరత్వము లభించు
నను వరించు నమరత్వము.

# మూడవ అధ్యాయం

కో ఽయ మాత్మేతి
వయ ముపాస్మహే?
కతరః స ఆత్మా
యేన వా పశ్యతి,
యేన వా శృణోతి,
యేన వా గంధా నాజిఘ్రతి,
యేన వా వాచం వ్యాకరోతి,
యేన వా స్వాదు చాస్వాదు చ విజానాతి?

యదేతద్ హృదయం మన శ్చైతత్,
సంజ్ఞాన మాజ్ఞానం
విజ్ఞానం ప్రజ్ఞానం
మేధా దృష్టి ర్ధృతి ర్మతి ర్మనీషా
జూతిః స్మృతిః సంకల్పః
క్రతు రసుః
కామో వశ ఇతి,
సర్వాణ్యేవైతాని
ప్రజ్ఞానస్య
నామధేయాని భవంతి.

# మూడవ అధ్యాయం

ఆత్మతత్త్వ మెటు లరయుట?
ఆత్మ యే దనాత్మ యేది?
ఆత్మ కనుల కాంచునదా?
చెవుల నాలకించునదా?

పరిమళమును పీల్చునదా?
పలుకుల నాలికించునదా?
ఇది కమ్మని దిది కాదని
యెంచి ఆరగించునదా?

మన హృదయము మన మనస్సు
మన సమస్త విజ్ఞానము
మన జ్ఞానము ప్రజ్ఞానము
అనుమతించవలె నను మతి
ఆలోచన-ఆలోకము
మతి మనీష గతి వేగము

స్మరణ శక్తి సంకల్పము
ఆవేశము లభిలాషలు
విషయవాసనలు వాంఛలు,
విభవము పయి అనురాగము
అన్నియు ప్రజ్ఞానమునకు
వన్నె పెట్టు పలు పేరులు.

ఏష బ్రహ్మైష ఇంద్ర,
ఏష ప్రజాపతి రేతే సర్వే దేవా
ఇమాని చ పంచ మహాభూతాని,
పృథివీ వాయు రాకాశ ఆపో జ్యోతీంషి-
ఇత్యేతాని, ఇమాని చ
క్షుద్ర మిశ్రాణీవ బీజాని, ఇతరాణి

చేతరాణి చాండజాని చ జారుజాని చ,
స్వేదజాని చోద్భిజ్జాని చాశ్వా గావః
పురుషా హస్తినో, యత్కించేదం
ప్రాణి జంగమం చ పతత్రి చ

యచ్చ స్థావరం,
సర్వం తత్ ప్రజ్ఞానేత్రం
ప్రజ్ఞానే ప్రతిష్ఠితం
ప్రజ్ఞానేత్రో లోకః
ప్రజ్ఞా ప్రతిష్ఠా, ప్రజ్ఞానం బ్రహ్మ.

స ఏతేన ప్రజ్ఞే నాత్మనా (అ)స్మాల్లోకాద్ -
ఉత్క్రమ్యాముష్మిన్ స్వర్గే లోకే
సర్వాన్ కామా నాప్త్వా
అమృతః సమభవత్, అమృతః సమభవత్-

* * *

బ్రహ్మ మహేంద్రాది సురలు,
ప్రజాపతియు, దేవతలును,
పంచమహా భూతములును,
మన్ను, మిన్ను, గాలి, వెలుగు
సకల చరాచరము, జలము,
సకల జీవ జంతువులును,

సకల బీజ సంతానము,
జారుజములు, స్వేదజములు,
అండజములు, ఉద్భిజ్జములు,
గోచరములు, ఖేచరములు,

హయ గజ తతి, నర సంతతి,
సకలము ప్రజ్ఞాన వితతి
అన్నియు ప్రజ్ఞానమునకు
అణగి మణగి మెలగుచుండు.
ప్రపంచమున కాధారము
ప్రజ్ఞ, బ్రహ్మ ప్రజ్ఞానము.

ప్రజ్ఞానము చేయూతగ
సుఖజీవన మనుభవించి
సకల కామితార్థములను
స్వర్గ సౌఖ్యములను పొంది,
అమరత్వము పొందు నరుడు
నరు డమరత్వము పొందును.

* * *

ఓం వాఙ్ మే మనసి ప్రతిష్ఠితా,
మనో మే వాచి ప్రతిష్ఠితం
ఆవి రావీర్మ ఏధి,
వేదస్య మ ఆణీ స్థః
శ్రుతం మే మా ప్రహాసీః,
అనే నాధీతేనాహోరాత్రాన్ సందధామి -
ఋతం వదిష్యామి,
సత్యం వదిష్యామి,
తన్మా మవతు తద్వక్తార మవతు,
అవతు మా మవతు వక్తారం,
అవతు వక్తారమ్.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఓంకారము వాఙ్మయమయి
నెలకొనవలె నా మనమున,
మనసుకూడ వాఙ్మయమయి
నెలకొనవలె నా పలుకున,
తరలిరమ్ము నను చేరగ
తెమ్ము వేద నవనీతము.

విన్నది నను విడనాడక
పవలు రేయి కలుపనిమ్ము,
పలుకనిమ్ము ఋతము నన్ను,
నిజము నన్ను పలుకనిమ్ము.

పలికిన నను బ్రోవవలయు,
పలికించిన వాని బ్రోచి,
పలికి పలుకరించిన మము
బ్రోచుత మా వాఙ్మనములు.

* * *

# సారాంశం

చివరిది మాండూక్యం. అథర్వణ వేదానికి సంబంధించిన యీ ఉప నిషత్తు ఆకారంలో చిన్నదయినప్పటికీ, ఆచార్యుల దృష్టిని ఎక్కువగా ఆకర్షించిన, అర్థగౌరవం గలిగిన అనర్ఘరత్నం. అన్నింటికి ఆద్యమయిన ఆత్మతత్త్వాన్ని గురించి ఐతరేయం వివరిస్తే, దాన్ని అనాది నాదమైన ప్రణవతత్త్వంతో సమీకరించి, ఆత్మ వైభవమంతా అకార - ఉకార - మకార సంయోగంతో ఏర్పడ్డ ఓంకారంలో ఇమిడి ఉన్నదని యీ ఉపనిషత్తు పన్నెండు మంత్రాల్లో వివరిస్తుంది.

ఓంకారంలో సమస్తసృష్టి అక్షర రూపంలో ఉంది - అన్న సూత్ర వాక్యం (ఓమిత్యేత దక్షరమిదం సర్వం)తో ఉపనిషత్తు ఆరంభిస్తుంది. దాని వ్యాఖ్యానమే భూత భవిష్యద్ వర్తమానాలట. అంతేకాదు, ఈ మూడు కాలాలకు మించిన మరో కాలమానాన్ని మనం ఊహించగలిగితే అది కూడా ఓంకారమేనని యీ తొలిమంత్రం నొక్కి చెపుతుంది.

ఒక్క మాండూక్యమే కాదు, దాదాపు అన్ని ఉపనిషత్తులుకూడా ఈ సత్యాన్ని స్పష్టంగా ప్రతిపాదించినవే. అన్ని వేదాలలో కొనియాడబడినది, అన్ని తపస్సులలో సేవించబడినది, బ్రహ్మచర్యాది వ్రతాలలో సాధించబడినది ఈ ఓంకారమేనని కఠోపనిషత్తు ఘంటాపథంగా చెపుతుంది. అదే పర-బ్రహ్మస్వరూపమట. దాన్ని తెలుసుకున్నవానికి తెలుసుకోవలసినది ఉండ దట. అలాగే, ప్రణవమనే ధనుస్సుపై, ఆత్మ అనే బాణాన్ని సంధించి, బ్రహ్మ అనే లక్ష్యాన్ని, గురితప్పక వేధించాలని ముండకోపనిషత్తు ఆదేశిస్తుంది. 'ఓంకార ఏవ ఇదం సర్వం'అని ఛాందోగ్యం శాసిస్తుంది. 'ఓమితి బ్రహ్మ ఓమితీదం సర్వం' అని తైత్తిరీయం వివరిస్తుంది. 'ఓం తద్ బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా, ఓం తత్ సత్యం' - అని నారాయణం (మంత్రపుష్పం) ఏకరువు పెడుతుంది. భీష్ముడు ధర్మరాజుకు ఉపదేశించిన విష్ణునామ సహస్రమంతా ప్రణవభాష్యమే. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ - అని

భగవద్గీత కూడా ఘోషిస్తుంది. 'తస్య వాచకః ప్రణవః' - అన్న పాతంజల యోగసూత్రం, ప్రణవం పరమాత్మకు మారుపేరని నిరూపిస్తుంది.

ఇలా పరమ మహర్షులు పరిపరి విధాల ప్రశంసించిన ప్రణవతత్త్వాన్ని ఆత్మపరంగా అన్వయించి, అందులో అఖిలసృష్టి ఎలా ఇమిడిఉన్నదో ఈ ఉపనిషత్తు వివరంగా చెపుతుంది.

ఓంకారం పరబ్రహ్మ స్వరూపం. ఆత్మకూడా పరబ్రహ్మ స్వరూపమే. కాబట్టి ఓంకారమే ఆత్మ, ఓంకారంలో నాలుగు మాత్రలు (భాగాలు) ఉన్నట్టే ఆత్మకు నాలుగు పాదాలున్నాయి అకార, ఉకార, మకారా లతో ఓంకారం ఏర్పడ్డది. కాని అన్నింటి సమ్మేళనంతో మరోరూపం (నాలుగోరూపం) మాత్రారహితమైనది - కొలతలకు అతీతమైనది - ఏర్పడుతుంది. ఈ నాలుగు మాత్రలకు అనుగుణంగా, ఆత్మ నాలుగు పాదాల్లో వ్యక్తమవుతుంది. మొదటిది వైశ్వానరం. జాగ్రదవస్థలో మనం మెలకువతో అన్ని పనులు చేసుకునే సమయంలో ఈ రూపం మనకు కనిపిస్తుంది. ఇది అందరికీ గోచరమయ్యే సర్వసామాన్య రూపం కాబట్టి దీన్ని "వైశ్వానర" మన్నారు. ఈ పాదంలో ఆత్మ ప్రసరించేప్పుడు నరుడు విశ్వరూపంలో విహరిస్తుంటాడు. ఈ రూపంలో నరుని ప్రజ్ఞ (తెలివి తేటలు) బహిర్ముఖంగా ఉంటాయి. సప్తలోకాలలో అతడు సంచరిస్తాడు. కర్మేంద్రియములు అయిదు, జ్ఞానేంద్రియములు అయిదు, పంచప్రాణాలు, అంతఃకరణ చతుష్టయం - మొత్తం 19 ముఖాలతో ఆత్మ వ్యవహరిస్తుంది. ఈ వైశ్వానరరూపమే ఓంకారంలోని తొలినాదం - అకారం. 'అకారో వై సర్వా వాక్' - అని శ్రుతులు ఈ నాదాన్నే స్తుతించాయి.

ఆ తర్వాత రెండవపాదంలో ఆత్మ తైజసరూపాన్ని ధరిస్తుంది. నిద్రలో కలలు గనే సమయంలో ఈ రూపం కనిపిస్తుంది. వైశ్వానరరూపంలో బహిర్ముఖంగా ఉన్న ప్రజ్ఞ, తైజసరూపంలో అంతర్ముఖ మవుతుంది. ఈ రూపంలోకూడా ఆత్మ సప్తలోకాల్లో విహరిస్తుంది. పది ఇంద్రియాలు,

అయిదు ప్రాణాలు, నాలుగు అంతఃకరణాలు-మొత్తం 19 ముఖాలు ఈ పాదంలో కూడా ఉంటాయి. కాని వైశ్వానరంలో స్థూలమైన అనుభూతిని పొందిన ఆత్మ, తైజసరూపంలో ఏకాంతమైన (ప్రవివిక్తమైన) అనుభూతిని పొందుతుంది. మెలకువతో మనం చేస్తున్న పనులు స్థూలంగా అందరికీ గోచరించేవిగా ఉంటాయి. కాని స్వప్నదశలో మనం పొందే కష్టసుఖాలు, అనుభవించే వినోద విషాదాలు మనవరకే పరిమితమై ఉంటాయి. మనం కలలో చూస్తున్న విషయాలు మనప్రక్కనే ఉన్న వ్యక్తికి కూడా బోధపడవు. అవి అతని ఊహకుకూడా అందవు. అందువల్ల స్వప్నదశలో వ్యక్తమయ్యే ఆత్మ తన సృష్టిలో తాను లీనమై ఉంటుంది. ఇదే ఉకారం.

మూడవ దశ సుషుప్తి, గాఢమైన నిద్ర. ఈ స్థితిలో కోరికలు, కలలు, కలతలు, కదలికలు-అన్నీ అంతరించిపోతాయి. హాయిగా మైమరచి నిదురించటమే సుషుప్తి. జాగ్రదవస్థలోనూ, స్వప్నదశలోనూ ఉన్న సప్తలోకాలు, పందొమ్మిది ముఖాలు ఈ పాదంలో ఉండవు. ఒకే ఒక లోకం, ఒకే ఒక అనుభూతి - ఆనందమయమైన అనుభూతి - మాత్రం ఈ దశలో మిగులుతుంది. ఈ పాదంలో ప్రచరించే ఆత్మకు ప్రాజ్ఞరూపం లభిస్తుంది. 'ఎఱుక' తప్ప మరో చైతన్యం ఆత్మలో ఉండదు. ఇదే మకారం.

ఈ మూడు పాదాలను అధిగమించి, నాలుగోపాదంలో ఊహ కందని లోకోత్తరదశలో ఆత్మ ప్రవేశించినప్పుడు, ఆత్మ పరమాత్మలో లీనమయిపోతుంది. అదే తురీయదశ. అదే జీవితసాధనకు పరమావధి, ఓంకారానికి చరమావధి. మాత్రారహితమైన శ్రీ మాతృస్వరూపం. ఆ స్థితిలో ప్రజ్ఞ బహిర్ముఖమని చెప్పేందుకూ వీలులేదు. అంతర్ముఖమని చెప్పేందుకూ వీలులేదు. లేక ఉభయముఖంగా ఉంటుందని కూడా చెప్పలేము. ప్రజ్ఞకు, ప్రాణానికి భేదమే ఉండదు. ఆ స్థితిలో ఉన్న ఆత్మ మనకు కనిపించదు. మనం పలకరిస్తే పలకదు. మనచేతికి చిక్కదు. అది ఇలా ఉంటుందని చెప్పలేము. ఊహించనుకూడా లేము. మరో పదార్థంతో పోల్చి దాని రూపురేఖలను నిరూపించలేము. ఆత్మసారమని

తప్ప దాన్ని మరో విధంగా వర్ణించటం సాధ్యం కాదు. పంచతత్త్వాలు, పంచభూతాలు, పంచేంద్రియాలు మొదలైన ప్రపంచకమంతా ఉపశమించగా, ఏర్పడ్డ శాంతశివస్వరూపం, అద్వైత రసస్వరూపం - ఆ నాలుగో పాదంలో గోచరిస్తుంది.

ఇలా ఓంకారంలోని నాలుగు నాదాలు, ఆత్మలోని నాలుగు పాదాలుగా రూపొందుతాయి. నాదాలే పాదాలు, పాదాలే నాదాలుగా ఈ నాద బ్రహ్మ ఓంకారంలో నిరంతరం నివసించి ఉంటుంది. ఈ అభేదాన్ని గమనించి, ప్రణవనాదంలో పరమ పురుషార్థాన్ని, ఆత్మపదాన్ని సాక్షాత్కరించుకో గలిగిన తపస్సంపన్నులు ధన్యులు. ఈ దారిని వెళ్ళే బాటసారులకు మాండూక్యం అక్షయంగా అక్షర పాథేయం అందిస్తుంది.

* * *

# మాండూక్యం

## (మూలం)

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాంస స్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః.

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు.

*ఓం శాంతిః శాంతిః శాంతిః.*

* * *

ఓమిత్యేతదక్షర మిదం సర్వం,
తస్యోపవ్యాఖ్యానం
భూతం భవద్ భవిష్యదితి
సర్వమోంకార ఏవ,
యచ్చాన్యత్ త్రికాలాతీతం
తదప్యోంకార ఏవ,
సర్వం హ్యేతద్ బ్రహ్మ -
అయమాత్మా బ్రహ్మ,
సో (అ)యమాత్మా చతుష్పాత్.

# అనాది
## (అనువాదం)

మంగళకర మధురసధుని వినవలె
కనుగొనవలె యజనమున మంగళము
పటుతరముగ కర చరణ కరణముల
సుర హితముగ మనవలె నియతమ్ముగ.

సకలము విను సురపతికి నమస్కృతి,
సకల మెరుగు పూషునకు నమస్కృతి,
సంకటములు తొలగించు గరుడునకు,
సుమతి నొసగు వాక్పతికి నమస్కృతి.

* * *

ఆద్యక్షర మోంకారము
సకల సృష్టి కాధారము
గత మాగత మనాగతము
మూటి కదియె మూల నియతి
మూడు కాలములను మించు
మొదలు తుదియు సకల మదియె
జగమంతయు బ్రహ్మమయము
సర్వాంతర్యామి బ్రహ్మ-
ఆత్మ బ్రహ్మ రూపమ్మున
నాలుగు పాదముల మెలగు.

జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః
సప్తాంగ ఏకోనవింశతి ముఖః
స్థూలభుగ్
వైశ్వానరః ప్రథమః పాదః.

స్వప్నస్థానో (అ)ంతః ప్రజ్ఞః
సప్తాంగ ఏకోనవింశతి ముఖః
ప్రవివిక్తభుక్
తైజసో ద్వితీయః పాదః.

యత్ర సుప్తో
న కంచన కామం కామయతే,
న కంచన స్వప్నం పశ్యతి,
తత్ సుషుప్తం.
సుషుప్త స్థాన
ఏకీభూతః
ప్రజ్ఞానఘన ఏవానందమయో
హ్యానందభుక్
చేతోముఖః
ప్రాజ్ఞ స్తృతీయః పాదః.

అందు మొదటి పాద మెపుడు
మెలకువ మెయి మెలగుచుండు
దాని యెరుక భువి నంతట
వెలువడి వెలుగొందుచుండు.
అవయువములు మూడు నాల్గు
ముఖములు పది ఐదు నాల్గు
అనుభవించు స్థూల భువిని
వైశ్వానర మనబడునది.
స్వప్న జగతిలో వెలుగయి
మెలగును రెండవ పాదము
అవయువములు మూడు నాల్గు
ముఖములు పది ఐదు నాల్గు
ఏకాంతముగా వెలుగును
తైజస నామమును పొంది.
కనురెప్పలు మూయుగ మది
కలలు కోరికలు తొలగగ
హాయిగ నిదురించునపుడు
పొందు తృప్తియే సుషుప్తి.
ఆ సుషుప్తి కాధారము
కూడుకొన్న ప్రజ్ఞానము
చేరి పేరుకొన్న ఎరుక
చేతో ముఖమున గ్రహించి'
తనివి దీర ఆనందము
తానే ఆనంద మగుచు
అది మూడవ పాద మదియె
ప్రాజ్ఞనామ పరిసంఖ్యము:

* * *

ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ
ఏషో (అ)ంతర్యామ్యేష యోనిః
సర్వస్య
ప్రభవాప్యయౌ హి భూతానాం.

నాంతఃప్రజ్ఞం
న బహిష్ప్రజ్ఞం
నోభయతఃప్రజ్ఞం
న ప్రజ్ఞానఘనం
న ప్రజ్ఞం నాప్రజ్ఞం,

అదృష్టం
అవ్యవహార్యం
అగ్రాహ్యం అలక్షణం
అచింత్యం అవ్యపదేశ్యం
ఏకాత్మ ప్రత్యయసారం

ప్రపంచోపశమం
శాంతం శివం
అద్వైతం
చతుర్థం మన్యంతే
స ఆత్మా
స విజ్ఞేయః.

సకల మెరిగి సకల భువిని
శాసించును చేతో నిధి
సకలాంతర్యామి ఆత్మ
భవ లయముల కాధారము.

అది లోపలి వెలుగు గాదు
వెలుపలి తెలివియును కాదు
లో వెలుపల వెలుగొందుచు
చెలగు జిలుగు వెలుగు గాదు
కూడుకొన్న తెలివి గాదు
తెలిసినదని తెలియనిదని
తెలుపలేము-చూడలేము

కలసి మెలసి మసలుట కది
ఆలవి కాదు-దాని జాడ
వెదకియు కనిపెట్టలేము
ఇది యని తలపోయలేము
ఇట్టిట్టని చెప్పలేము
ఏ తావున ఎటులుండునొ!
ఎంచి ఎరుక పరచలేము
ఆత్మ మూలమునవె దాని
పొందవలయు నదియె తెన్ను-

ప్రాపంచిక పరిధులెల్ల
పరిసమాప్తి నొందు చోట
పరమశాంతి పరమశివుని
రెండుగ కనుగొనని చోట
అగపడునది అరయుగ అదె
ఆత్మకు నాల్గవ పాదము.

సో (అ)యమాత్మాధ్యక్షర
మోంకారో (అ)ధిమాత్రం
పాదా మాత్రా
మాత్రాశ్చ పాదా
అకార ఉకారో మకార ఇతి.

జాగరితస్థానో
వైశ్వానరో (అ)కారః
ప్రథమా మాత్రా, (ఆ)ప్తేరాదిమత్వాద్
వా, (ఆ)ప్నోతి హ వై
సర్వాన్ కామానాదిశ్చ భవతి
య ఏవం వేద.

స్వప్నస్థానః
తైజస ఉకారో
ద్వితీయా మాత్రా, ఉత్కర్షాద్
ఉభయత్వాద్వా, ఉత్కర్షతి హ వై

ఆదియె తెలిసికొనవలసిన
ఆత్మతత్త్వమది అనాది,
ఆదియె ప్రణవ రూపమ్మున
ఒదిగియున్న దక్షరముగ
మాత్రలు పాదములు కాగ
పాదములే మాత్రలుగా.

అది అకారమున మొదలయి
'ఉ' కారమున వెలుగొందుచు
'మ'కారమున పరిసమాప్తి
పొందునదే-ఓంకారము.

మెలకువమెయి మెలగుచుండు
వైశ్వానర రూపమ్మున
అక్షరముల కాద్యాకృతి
తొలిపలుకు - 'అ'కార మాత్ర
సకల కామితార్థములకు
ఆదియగు - 'అ'కార వేది.

కలలయందు తైజసముగ
వెలుగొందు-'ఉ'కార మాత్ర
అన్నింటను ఉత్కర్షము
పొంది ఉభయతను కూర్చును.

జ్ఞానసంతతిం
సమానశ్చ భవతి,
నాస్యాబ్రహ్మవిత్ కులే భవతి
య ఏవం వేద.

సుషుప్తస్థానః ప్రాజ్ఞో
మకార స్తృతీయా మాత్రా,
మితేరపీతేర్వా,
మినోతి హ వా ఇదం సర్వం
అపీతిశ్చ భవతి
య ఏవం వేద.

అమాత్ర శ్చతుర్థో (అ)వ్యవహార్యః
ప్రపంచోపశమః
శివో (అ)ద్వైత, ఏవ మోంకార
ఆత్మైవ, సంవిశత్యాత్మనాత్మానం
య ఏవం వేద
య ఏవం వేద.

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః,
స్థిరై రంగై స్తుష్టువాంస స్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః.

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

సర్వసమానముగ పంచు
జ్ఞాన సంతతిని జగతికి
బ్రహ్మ విదుల వంశమ్మున
ఉదయించు- 'ఉ'కార వేది.

ప్రాజ్ఞ రూపమున మేరను
చేరి కూరిమిని సుషుప్తి
సౌఖ్య మనుభవించుచుండు
మూడవది-'మ'కార మాత్ర
విదిత మతిని మితి నరయుచు
వెలుగొందు-'మ'కార వేది.

మాత్ర లుడిగి ప్రాపంచిక
మాంద్య ముపశమించినపుడు
అద్వైతము, శివ తత్త్వము
ఆత్మద్యుతి నాత్మ నరసి
అవ్యయ మవ్యవహార్యము
చేరును-ఓంకార వేది.

మంగళకర మధురసధుని వినవలె
కనుగొనవలె యజనమున మంగళము
పటుతరముగ కర చరణ కరణముల
సుర హితముగ మనవలె నియుతమ్ముగ.

సకలము విను సురపతికి నమస్కృతి,
సకల మెరుగు పూషునకు నమస్కృతి,
సంకటములు తొలగించు గరుడునకు,
సుమతి నొసగు వాక్పతికి నమస్కృతి.

* * *